జూలై
1948

# చందమామ

ఖరీదు
0-6-0

పిల్లల మాసపత్రిక





*Chandamama July '48*

*Photo by R. Krishnan*

నే నొక్కతెనూ ఒకటి!

# చందమామ



ఈ సంచికలో యివి
చదువుకోండి



ఇవన్నీగాక. చిక్కుచదరాలు. ముగ్గులు.
చిక్కుబొమ్మలు, పజిలు
ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.




సంచాలకుడు: చక్రపాణి

సంపుట 3 | జూలై 1948 | సంచిక 1

## పాపలూ!

నేను మీయింటికి రావటం మొదలుపెట్టి ఒక సంవత్సరం అయింది. ఈ ఏడాదినించీ మీరు నన్ను ఎంత మర్యాద చేశారో, నన్ను చూసి ఎంత సంతోషపడ్డారో నేను చెప్పలేకుండా వున్నాను. మీరే కాదు, మీ అమ్మా, నాన్నా, మీ అవ్వా, తాతా అందరూ కూడా నన్ను సమానంగానే గౌరవించారు. నిజానికి నేను మీ అందరికీకూడా మామనే కదూ! మామను మర్యాద చెయ్యనివాళ్లు ఎవరైనా ఉంటారా?

పోతే ఇకముందు కూడా నేను మునుపటి లాగానే చక్కగా అలంకరించుకొని, మంచి మంచి శాస్త్రాలు చెప్పుతూ మీ ఇంటికి వస్తాను. మీ ప్రక్కయిళ్లకు కూడా తీసుకపోతారు కదూ నన్ను?

మీ

చందమామ

# అట్టమీది బొమ్మ

అబ్బాయిలూ! మీరు జటాయువు పేరు విన్నారు కదూ? జటాయువు పెద్ద పక్షి. అది రెక్కలు విప్పితే ఆకాశం కప్పినట్లయ్యేది. అది కాళ్లతో తన్నితే పెద్ద పెద్ద రథాలు బోర్లపడేవి. అంత పెద్ద బలశాలి అది.

రామలక్ష్మణులు లేని సమయంలో రావణాసురుడు సీతాదేవిని దొంగలించి పుష్పకరథం మీద లంకకు తీసుకుపోతున్నాడు. పాపం! సీతాదేవి ఏమి చేస్తుంది? చెట్లతో, పుట్టలతో, కొండలతో, గుట్టలతో, నదులతో, వాగులతో అన్నింటితోనూ ఈవార్త రాముడితో చెప్పమని మొరపెట్టింది. జటాయువప్పుడు ఒక చెట్టుమీద కూర్చుని కునుకుతున్నది. ఈ కేకలు దాని చెవినిపడి లేచి, రావణుడి రథానికి అడ్డం వెళ్లింది. రావణుడు బాణాలు వేశాడు; జటాయువు వాటిని లెఖ్ఖచెయ్యకుండా కాళ్లతో రావణాసురుడి రొమ్ముమీద తన్నింది; గుఱ్ఱాలను ఒక్కదెబ్బకు చంపింది. రావణాసురుడు బాగా భయపడి, రథాన్ని వదిలి సీతాదేవిని పట్టుకుని భూమిమీదకు దిగాడు. జటాయువుకూడా కిందికి దిగి వచ్చి రావణుడి మొహానతన్నింది. అతని కిరీటం పోయి దూరంగా పడింది. అప్పుడు రావణుడు చప్పున కత్తి తీసి జటాయువు రెక్కలు నరికివేశాడు. రెక్కలు పోవడంతో జటాయువు కూలబడి పోయింది.

అలాగే కొనవూపిరితో రాముడు అక్కడికి వచ్చేవరకూ పడివుండి సీతాదేవి వార్త అతనికి చెప్పి చనిపోయింది. జటాయువు మరణానికి రాముడు చాలా విచారపడ్డాడు. దానికి దహన సంస్కారాలుచేసి స్వర్గం యిచ్చాడు. చూశారా, జటాయువుత్యాగం? తను గెలవలేనని తెలిసికూడా అధర్మం జరుగుతుంటే వోర్చలేక చివరివరకు పోట్లాడింది!




దొరవారి యబ్బాయి
చురుకైన వాడు
పలుకరించినవారి
చెలికట్టనీడు.

బస్తీ చదువు వంట
పట్టినట్లుంది
పల్లెవారల చూచి
పరిహసిస్తాడు.

సీమదొర మోస్తరా
శ్రీవారి బిడ్డ
వేసంగి సెలవలకు
వేంచేసినాడు.

తలిదండ్రులకు తన
తెలివితేటలను
ప్రకటింపవలెనని
భావించినాడు.

అమ్మా అబ్బా సరసన తిండికి
అతడుగూడ గూర్చున్నాడు
ఉడికీ ఉడకని కోడిగ్రుడ్లు రెం
డుంచిన పళ్ళెము చూచాడు.

ఈ రెంటిని మూటిని చేస్తానని
ఇటు నటు గ్రుడ్లను ద్రిప్పాడు
ఒకటీ, రెండూ కలిపిన మూడగు
నూహిస్తా రెమన్నాడు.

తండ్రి

అమ్మ దొకటి నా దొకటి మూడవది
అబ్బాయీ! నీ దనగానే
దసరా బుల్లోడై పిల్లాతడు
తలవంచుక కూర్చున్నాడు.

ఎత్తుకు పైయెత్తెఱిగిన పెద్దలు
ఇట్లే మాడుస్తుంటారు
చిన్నని పెద్దని తెలియఁకాడితే
సిగ్గు చితికి పోతుంటారు.

ఏటుకూరి

# మాకరాజు

ఏటుకూరి

శాస్త్రులవా రొక గ్రంథ మ్మేదో చంకన పెట్టుకు పోతుంటే మాకరాజుగా రాతని బిలి చీ మాదిరిగా ప్రశ్నించారు.



మాకరాజు

శాస్త్రి గా రదేమిటండి?
చంక బట్టుకున్నదే?

శాస్త్రి

భారతమ్ము బాబయా?
పంచమ వేదమ్మయా?

మాకరాజు

వర్జ ముందో లేదొ చూడ
వలయు బయటబెడుదురా?

శాస్త్రి

తిథులు, వర్జ ముండ నిందు
కథలు, గాథలుండును.

మాకరాజు

పనికిరాని గ్రంథమేల?
పారవేయు రా దనన్,
తోకముడిచె శాస్త్రులు
మాకరాజు నవ్వెను.

ఆ వీధిన మన శాస్త్రిల వారయి
దాఱు రోజులకె పోతుండీ
కత్తి పుచ్చుకొని పోవు రాజుతో
గలిసి తమాషగ నిటులాడెన్.

శాస్త్రి

గడ్డవేఁదిగె బాబయా?
కత్తి కొంచె మిత్తురా?

మాకరాజు

చంపినావు శాస్త్రిలా?
సరస మాడి నానయా!

శాస్త్రి

సరస మేటి బాబులా?
సత్యమున్న దంటిరి.

మాకరాజు

దండాలండి స్వాములు!
తగిన శాస్తి యైనది.

ఎవరి నెట్టు లాడవలెను?
ఎఱుగఁటెంత వారికో?







# అత్యాశ

అనగా అనగా ఒక వూళ్లో ఒక ముసలవ్వ వుండేది. ఆమె చాలా భక్తురాలు, ఆచారవంతురాలు కూడా. ప్రతి యేకాదశి, అమావాశ్య రోజులలో ఉపవాసం ఉండి మరురోజు పౌరోహితుణ్ణి పిల్చి దేవునికి పూజచేయించి కాని అహారం ముట్టేది కాదు. దేవతాపూజలో ఏలోపమూ లేకుండా వుండాలని పాపం అవ్వకోరిక.

వైకుంఠయేకాడశి వచ్చింది. అవ్వ తన వాడుక ప్రకారం ఉపవాసం వుంది. ద్వాదశి నాడు పెందలాడే పౌరోహితుణ్ణి పిల్చింది పూజకు.

పౌరోహితుడు అతి ఆశగలవాడు. ఆయనకు డబ్బే ప్రధానముకాని యితర గొడవలతో ఆయనకు అవసరములేదు. ఆ దినం ఆయనకు చాలా ఆహ్వానాలు వచ్చాయి. అందరితో చెప్పేడు వస్తానని, యేదో పది యిండ్లకు పోతే పది రూకలు వస్తాయికదా అని.

కొందరి యిండ్లకు పోయేడు మన పౌరోహితుడు. యేదో గొణ గొణ గొణిగేడు. పూజచేసినట్టు నటించాడు. పాపం వాండ్లు అమాయకులు. అయ్య చెప్పింది వేదం అనుకున్నారు. దక్షిణలు యిచ్చారు. అయ్యగారు అవి రొంటిన పెట్టుకుని అవ్వగారింటికి వచ్చారు.

కాని మన అవ్వ అంత తెలివితక్కువదనుకున్నారా? కాదుసుమా! పూజకు అవ్వ పూలు, పండ్లు వగైరా అన్నీ సిద్ధం



కె. పి. వరలక్ష్మీదేవి
గుండ్లకుంట




చేయాలనుకుంది. కాని యింతలోనే పౌరోహితుడు వచ్చాడు. పూజకు కూర్చున్నాడు. పూలు, వగైరా వస్తువులు తెస్తాను కొంచం వుండమని అవ్వ చెప్పింది. కాని పౌరోహితుడు యిప్పుడు అవి అన్నీ అవసరం లేదంటూ పూజ మొదలుపెట్టేడు. ఆయనకు యింకా ఆహ్వానాలు వున్నాయిగా మరి. అక్షింతలు తీసుకున్నాడు.

"పుష్పార్థం అక్షతాం సమర్పయామి; నారికేళార్థం అక్షతాం సమర్పయామి; దివ్యపరిమళ గంధార్థం అక్షతాం సమర్పయామి" ఇది అది అక్షతాం సమర్పయామి; అంటూ కొంచంసేపు గొణిగేసి పూజ ముగించాడు.

ఇదంతా అవ్వ చూస్తూనే ఉంది. అతని తొందర గ్రహించింది. పౌరోహితునిపై అవ్వకు కోపం వచ్చింది. ప్రతీకారం చెయ్యాలనుకుంది.

పౌరోహితుడు పూజ పూర్తిచేసి దక్షిణ యిమ్మని అవ్వనడిగాడు. అవ్వ యింట్లోకి పోయి, కొంచం అక్షింతలు తెచ్చింది. అయ్య దక్షిణయిస్తుందని చెయ్యిజాపేడు. వెంటనే అవ్వ ఆయనచేతిలో అక్షింతలు వేసి 'దక్షిణార్థం అక్షతాం సమర్పయామి' అంటూ వెళ్ళిపోయింది.

పౌరోహితుడిది గ్రహించి, సిగ్గుపడ్డాడు. తల వంచుకొని వెళ్ళిపోయాడు. ఆ రోజు నుంచి మళ్లీ యెప్పుడూ ఆయన పూజలో అవకతవకలు చెయలేదు. చూచారా మన అవ్వ యుక్తి!




1


2


3


4


5


6


7


8


9

## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పైన తొమ్మిది కుందేళ్ల జంటలువున్నై చూశారా. తొమ్మిది జంటలూ ఒకే మోస్తరుగా వున్నట్టు కనిపిస్తున్నయ్యి కదూ? కాని, తొమ్మిదింట్లో రెండు జంటలు మాత్రమే ఒక్క మోస్తరుగావున్నై. ఆ జంటలేవో మీరు కనుక్కోండి. కనుక్కోలేకపోతే జవాబు 52 పేజిలో చూడండి.




రెండువేల ఏళ్లకిందట దక్షిణదేశంలో వర్ధమానుడనేవా డుండేవాడు. అతని తండ్రి మిక్కిలి ధనవంతుడు. ఆయనకు సముద్ర వ్యాపారం ఉండేది. ఆయన ఓడలు నిర్మించి, వాటిమీద తన మనుష్యులను సముద్రంలోని ద్వీపాంతరాలకు పంపి వ్యాపారం చేసేవాడు. సముద్రప్రయాణం చేసి వచ్చిన మనుష్యులు ఇతరదేశాల వింతలు తండ్రికిచెబుతుంటే వర్ధమానుడు వింటూ ఉండేవాడు; తానుకూడా ఆ దేశాలు చూడాలని అభిలాషపడేవాడు.

తండ్రి లోకాంతరగతుడై వ్యాపారం తనవశంకాగానే వర్ధమానుడు బ్రహ్మాండమైన ఓడ ఒకటి కట్టించాడు. దానికి బ్రాహ్మణుల చేత పుణ్యాహవాచనం చేయించాడు. తన ప్రయాణానికి ముహూర్తం పెట్టించాడు. వేలాది ప్రజలకు అన్నదానమూ, వస్త్ర దానమూ చేశాడు. ఓడనిండా వర్తకానికి అవసరమైన వస్తువులూ, మూడునెలల ప్రయాణానికి సరిపడే ఆహారపదార్థాలూ పెట్టించాడు. ముహూర్తానికి సరిగా ఓడ రేవులోనుంచి కదిలింది. తూర్పుదీవులకేసి సాగింది.

ఒక వారంరోజులు ప్రయాణం సక్రమంగానే జరిగింది. ఆ తరువాత ఒక పెద్ద తుపాను ప్రారంభమైంది. ఈ తుపాను క్రమంగా పెద్దదై, భయంకరంగా పరిణమించింది. ఓడ వాయువేగంతో తుపానులో పడి కొట్టుకుపోసాగింది. అది ఎటు పోతున్నదీ ఎవరికీ తెలియదు. ఈ విధంగా మూడు పగళ్లూ, మూడు రాత్రులూ తుపానులో కొట్టుకుపోయి ఓడ సముద్ర మధ్యాన

జోనాథన్ స్విఫ్టు వ్రాసిన గల్లివర్స్ ట్రావెల్సుకు అనుకరణ.



రాళ్ల గుట్టలకు తగిలి, పగిలి, మునిగి పోయింది. రెండు మూడు లక్షల విలువ రత్నాలూ, వస్త్రాలూ మొదలైన సరుకులు సముద్రంపాలు కావటమేకాక, ఓడలో ఉన్న నూరుమంది ప్రాణులూ సముద్రానికి బలిఅయినారు.

వర్ధమానుడు మాత్రం ప్రాణరక్షణార్థం ఒక ఓడ దూలాన్ని పట్టుకుని దాని సహాయంతో ఈదసాగాడు. కాని త్వరలోనే అతనికి స్పృహ తప్పిపోయింది. ఆ తర్వాత ఏమి జరిగిందీ అతనికి తెలియదు. అతనికి తిరిగి ఒళ్లు తెలిసేసరికి ఎండకాస్తున్నది. సముద్రం ప్రశాంతంగా ఉంది. అతను మళ్లీ ఈదటానికి దూలంమీదినుంచి దిగి, నీటిలో నిలబడేసరికి అతని కాళ్లకు అడుగు తగిలింది. అక్కడ సముద్రం అతనికి మొలలోతే ఉంది. అయినా తీరం చాలా దూరాన ఉంది. వర్ధనుడు నీటిలో నడుచుకుంటూ ఒడ్డుకేసి రాసాగాడు.

అక్కడితీరం నిర్మానుష్యంగా ఉంది. తన ప్రాణం దక్కినందుకు వర్ధనుడు యిష్టదేవతలను ప్రార్థించుకుని. అక్కడే పచ్చికబయలుమీద పడుకుని తిరిగి నిద్ర పోయాడు. అతను నిద్రలేచేసరికి మర్నాడు



తెల్లవారుతున్నది. జరిగినదంతా అతనికి జ్ఞాపకం వచ్చింది. అతను లేచి కూర్చొబోయినాడు, కాని సాధ్యం కాలేదు. అతని చేతులూ కాళ్ళూ నేలకు అంటుకు పోయినట్టు తోచింది. తల కదిలిద్దామన్నా జుట్టు ఎవరో పట్టుకు లాగినట్టు నొప్పిపుట్టింది. కొని వేల దారపుపోగులతో ఎవరో అతన్ని నేలకు కట్టివేశారు.

వర్ధమానుడు అత్యాశ్చర్యంతో ఇదేమిటా అని ఆలోచిస్తుండగా అతని కాలిమీద ఏదో పురుగు పాకుతున్నట్టు తోచింది. ఆ ప్రాణి క్రమంగా తన రొమ్ముమీదికి వస్తున్నది. వర్ధనుడు కష్టపడి తల కొంచెం యెత్తి చూచునుగదా, అతని రొమ్ముమీద నిలబడి ఉన్నది ఒకమనిషి! ఆ మనిషిఎత్తు సరిగా అరంగుళాలు. ఆ మనిషి చేతిలో విల్లున్నది, భుజాన అంబులపొది ఉన్నది.

వర్ధమానుడు మేలుకొన్నాడని తెలుసుకుని ఆమనిషి ఏదో కీచుకేక పెట్టాడు. మరో యాభైమంది మనుష్యులు వర్ధమానుడి వొంటిమీదుగా పాకి రాసాగారు.

"ఎవరు మీరు? నన్నెందు కిట్లా బంధించారు?" అన్నాడు వర్ధనుడు. అతని గొంతు ఆ చిన్నమనుష్యులకు ఉరుములాగా విని



పించి ఉండాలి. వా రంతా బెదిరి పారిపోయినారు. కొందరు కంగారులో కిందపడి దెబ్బలుకూడా తగిలించుకున్నారు.

వాళ్ళ నడిగి లాభంలేదని వర్ధమానుడు తనచేతిని బలంగా గుంజాడు. దానికి కట్టిన దారపుపోగులన్నీ పుటపుటా తెగిపోయినాయి. తలకు, మిగిలిన అవయవాలకూ కట్టివున్న దారపు పోగులు కూడా తెంచుకోసాగాడు. తమబందీ తప్పించుకుంటున్నాడని గ్రహించి ఆ బుల్లిమనుష్యులు దూరం నుంచి వర్ధమానుడిమీద బాణాలవర్షం కురిపించారు. ఈ బుల్లి అంబులు పూచిక ముళ్లల్లే వర్ధమానుడి గడ్డల్లో యిరుక్కుపోయాయి. ముఖానికి తగిలినవి మటుకు చీమలు కుట్టినట్టు బాధ పెట్టాయి. వాళ్లు తనను ఏం చేస్తారో తెలుసుకుందామని వర్ధమానుడు కట్లు వొదల్చుకోవటం మాని కదలకుండా పడుకున్నాడు.

కొంచెంసేపటికల్లా ఆ మనుష్యులు, భయం కొద్దికొద్దిగా పోగొట్టుకుని, వర్ధనుణ్ణి సమీపించారు. ఒకడు అతని చెవిదగ్గిర ఏదో అరిచాడు. వర్ధమానుడికి ఆభాష అర్థం కాలేదు. కాని తనకు ఆకలి అవుతున్నదని సంజ్ఞలద్వారా తెలియజేశాడు. వెంటనే వారు వెళ్లిపోయి అతనికోసం ఆహారం తెచ్చారు. ఎన్నోవేలమంది అతని ముఖం మీదికి ఎక్కి ఆహారం అతనినోట్లో వేస్తేనే గాని అతని కడుపు నిండలేదు. ఎట్లాగైతేనేమి అతను పొట్టనింపుకుని మళ్లీ నిద్రపోయాడు.







వవర్ధమానుడు చేరిన ద్వీపంపేరు వామన ద్వీపం. అక్కడిమనుష్యులు వామనులు. తమదేశానికి ఒక పెద్ద రాక్షసుడు వచ్చాడనేవార్త వామనరాజునకు తెలిసింది. అతనిని బంధించి తన దగ్గిరికి తీసుకురావటానికి రాజుగారు తన దగ్గిర ఉన్న బళ్లలో కల్లా పెద్ద బండిని పంపారు. వర్ధమానుడు భోజనం చేసి తిరిగి నిద్రపోతున్న సమయంలో రాజుగారు పంపిన బండి వచ్చింది. ఈ బండి ఏడడుగులుపొడుగూ, నాలుగడుగులు వెడల్పూ ఉంది. దానికి ఇరవైరెండు చక్రాలున్నాయి. వెయ్యిమంది వామనులు మూడు గంటలు శ్రమపడి వర్ధనుణ్ణి ఈ బండిమీదికి అతిశ్రమతో ఎక్కించగలిగారు. ఇంతసేపూ వర్ధమానుడు నిద్రలేవలేదు. కారణమేమంటే అతను తిన్న ఆహారంతోపాటు వామనులు అతనికి మత్తు కలిగించే సారాయికూడా ఇచ్చారు.

రాజమందిరం అక్కడికి అరమైలు దూరంలో ఉన్నది. వర్ధమానుడి బండికి పదిహేనువందల గుర్రాలు కట్టారు. ఆ గుర్రాలు నాలుగున్నర అంగుళాల ఎత్తు గలవి. ఈ బండి నాలుగు గంటలు ప్రయాణంచేసేసరికల్లా ఒక ఇరుసు విరిగింది. దానికి మరమ్మతు చెయ్యటానికి ఆగారు. ఈ సమయంలో వర్ధనుణ్ణి చూడటానికి కొందరు వామనులు అతని మొహం మీద ఎక్కారు. వారిలో ఒకడు తనకర్ర వర్ధమానుడి ముక్కుపుటంలోనికి పోనిచ్చి తడివిచూశాడు. వర్ధమానుడికి తుమ్ములు వచ్చాయి. ఆ తుమ్ములకు అతని ముఖం మీద ఎక్కినవారు అదిరి కిందపడి కాళ్లూ చేతులూ విరుచుకున్నారు. ఈ లోపుగా





ఇరుసు మరమ్మతు పూర్తి అయి మళ్లీ ప్రయాణం సాగింది.

దారిలో చీకటిపడింది. వామనులు ప్రయాణంచాలించి ఒకచోటమజిలీచేశారు. తెల్లవార్లూ ఆ అయిదు వందల మంది వామనులు వర్ధమానుడికి కాపలాకాశారు. అందులో సగంమంది దివిటీలు పట్టారు, మిగిలినవాళ్లు విల్లూ, బాణా లూ పట్టుకున్నారు. తిరిగి తెల్లవారగానే ప్రయాణం సాగింది. మిట్టమధ్యాన్నాని కల్లా బండి పట్టణానికి ఒక ఫర్లాంగు దూరంలోకి వచ్చింది.

అక్కడికి వామనమహారాజు వర్ధనుణ్ణి స్వయంగా చూడటానికి అనుచరులతోసహా ఎదురువచ్చాడు. కాని రాజుగారు వర్ధనుడి శరీరంమీదికి ఎక్కటం అపాయకరమని ఆయన పరివారం అడ్డుచెప్పింది.

ఇక్కడ ఒక పాడుబడిన గుడి ఒకటి ఉంది. అది కొంతకాలంకింద అపవిత్రమైపోవటంచేత పాడుపెట్టారు. అందులో వర్ధమానుడికి విడిదిఏర్పాటుచేశారు. ఆపట్టణంలో అతను పట్టే ఆవరణ అది ఒకటే.

రాజుగారి కమ్మరులు వచ్చి వర్ధనుడి కాలికి తొంభైఒక్క గొలుసుకట్టి వాటిని దేవాలయం వాకిలికి బంధించారు. ఆ తరువాత వర్ధమానుణ్ణికట్టిన పోగులన్నీ కోసివేశారు. అతని కాలికి కట్టిన గొలుసులు మన స్త్రీలు వేసుకునే బంగారు గొలుసులంత లావున్నాయి; అతను దేవాలయం లోపలగాని బయటగాని కొద్దిదూరం కదలటానికి వీలయినంత పొడుగున్నాయి.

[ఇంకా వుంది]






# అదృష్టహీనులు

అనగనగా ఒక వూరు. ఆ వూళ్లో ముగ్గురు బీద పిల్లలు వుండేవారు. అదేమి చిత్రమోగాని, పాపం వాళ్ల ముగ్గురికీకూడా పట్టుమని పదేళ్ళన్నా నిండకముందే తలిదండ్రులు చనిపోయారు. అసలే బీదవారు గదా. పైగా దిక్కులేని పక్షులైపోవటంచేత ఎలా బ్రతకాలో వారికి ఏమీ పాలుపోలేదు. ముగ్గురూ ఒకేవిధమైన కష్టదశలోవుంటాన యిట్టే స్నేహితులయారు. ఏ పని చేసినా ఒకరినొకరు సంప్రదించుకుని, ఒకరికొకరు అండగా వుంటూ, ఆ వూళ్లోనే నాలుగిళ్ళలో అడుక్కుని జీవిస్తుండేవారు.

ముగ్గురూ క్రమంగా పెద్దవారైనారు. ఎంతకాలమని అడుక్కుని తింటానికి సాగుతుంది. క్రమంగా వూళ్లోవాళ్లు వాళ్లకి ముష్టివెయ్యటం మానివేశారు. పోనీ ఏదైనా పనిచేసి నాలుగు డబ్బులు సంపాయిద్దామంటే వాళ్లకు పని యిచ్చే నాధుడు లేడు. ఒక పూట తింటే మరొకపూటకు లేక, పస్తులుంటూ, కట్టుకోను గుడ్డలు లేక పాపం ఆ ముగ్గురు స్నేహితులూ ఎంతో కష్టంగా కాలం వెళ్లబుచ్చుతున్నారు.

నానాటికి వాళ్లకి కష్టాలెక్కువైపోయి, జీవించటమే దుర్భరం కాసాగింది. చివరికి ముగ్గురూచేరి కూడబలుక్కుని ఒక నిశ్చయానికి వచ్చారు. అదేమంటే, "ముగ్గురూ విడిపోయి, ఎవరిత్రోవన వారు బయలుదేరివెళ్లి ఒక్క సంవత్సరంలోగా ఏదైనా విద్య నేర్చుకోవాలి. సంవత్సరం పూర్తి కాగానే ముగ్గురూ ఒకచోట కలుసుకుని ఎవరు నేర్చినవిద్య వారు ప్రదర్శించాలి. ఇక ఆయా విద్యలవల్ల వాళ్లు జీవితం వెళ్ల

యిరగవరపు వెంకటాచార్యులు, విశాఖపట్నం



బుచ్చగలగాలి.'' ఇలా నిశ్చయించుకుని ముగ్గురు స్నేహితులూ మూడు దార్ల వెంట బయలుదేరిపోయారు.

మొదటివాడికి, వెళ్ళగా, వెళ్ళగా ఒక సన్యాసి కనిపించాడు. సన్యాసికి శిష్యుడుగా వుండి అతనికి సేవచేస్తూ అతను కాలం వెళ్ళబుచ్చసాగాడు. సన్యాసి అతనిసేవకు మెచ్చుకుని ఒక విద్య నేర్పాడు. అదేమంటే, ఏదైనా ఒక జంతువుయొక్క ఎముకతో ఆ జంతువు యొక్క అస్థిపంజరాన్నంతా పూర్తిచేయవచ్చు. ఈ విద్య నేర్చుకుని శిష్యుడు సన్యాసిదగ్గరే సంవత్సరం గడువు వెళ్లేదాకా వుండసాగాడు.

రెండవవాడు పోయి, పోయి, ఒక ఋషీశ్వరుని దర్శించి, అతని సేవచేయసాగాడు. ఋషీశ్వరుడు మెచ్చి అతనికి ఒక విద్య నేర్పాడు. అదేమంటే, ఏదైనా ఒక అస్థిపంజరమునకు, చర్మమూ, పంచేంద్రియాలు వచ్చేటట్లు చెయ్యవచ్చు. ఈ విద్య నేర్చుకుని రెండోవాడు కూడా సంవత్సరం గడువుకు ఎదురుచూస్తూ ఋషీశ్వరుడిదగ్గరే వుండసాగాడు.

ఇక మూడోవాడు, నడిచీ, నడిచీ చిట్టచివరకు ఒక అరణ్యం చేరుకున్నాడు. అక్కడ ఒక యోగి కనిపించాడు. తన కష్టదశనంతా యోగితో చెప్పుకుని ఏదైనా ఉపాయం చెప్పమని కోరాడు. యోగికి కూడా జాలికలిగి ఒక విద్య నేర్పాడు. అదేమంటే ఏదైనా ప్రాణంలేని జీవానికి ప్రాణం తెప్పించవచ్చు. శిష్యుడు చాల



సంతోషంగా యోగిసేవచేస్తూ సంవత్సరం గడువుకు ఎదురుచూస్తూన్నాడు.

* * *

ఇట్టే సంవత్సరం గడిచి పోయింది. అనుకున్న ప్రకారం ఒకచోట ముగ్గురు స్నేహితులూ కలుసుకొన్నారు. నువ్వేమి నేర్చుకొచ్చావంటే నువ్వేమి నేర్చుకొచ్చావని ఒకరివిద్య ఒకరు తెలుసుకొని చాల సంతోషించారు. ప్రత్యక్షంగా ఎవరి విద్యలను వాళ్లు ప్రదర్శించాలని తీర్మానించుకున్నారు. మొదట అసలు ఎముక ఒకటి అవసరం గనక ముగ్గురూచేరి వెతగ్గా ఒక ఎముకకనిపించింది. వెంటనే మొదటివాడు తను నేర్చిన విద్యవల్ల దాని పూర్తి అస్థి పంజరాన్ని తయారుచేశాడు. వెంటనే రెండవవాడు తను నేర్చిన విద్యవల్ల దానికి మాంసము, చర్మము, పంచేంద్రియములు కల్పించాడు. తీరాచూస్తే అది ఒక సింహం. ప్రాణంలేని సింహం. ఇక మూడోవాడు తనూ తన విద్య చూపాలికదా!



వెంటనే తను నేర్చిన విద్యవల్ల ఆ సింహానికి ప్రాణం రప్పించాడు. ఇంకేముంది; ప్రాణం వచ్చీ రావడంతోనే సింహం ఒక్క పరుగున వాళ్ళ మీదికి పురికి ముగ్గురినీ చీల్చి చెండాడి తినేసింది.

చూశారా, పాపం! అదృష్టం అంటూ లేంది మనం ఎంత తన్నుకున్నా కలిసి రాదు. అదృష్టహీనులను కష్టాలు ఎప్పుడూ వెంటాడుతూనే వుంటాయి.



# చమత్కారము

అనగా అనగా ఒక ఊరిలో ఒక రాజు ఉండేవాడు. రాజు కాబట్టి రోజూ పంచభక్ష్య పరమాన్నాలతో భోంచేసేవాడు. అందుచేత అతని శరీరం బాగా లావుఅయిపోయి, చిన్న ఏనుగుపిల్లలాగున కనిపించేవాడు. పైగా, అతను కదలడానికి కూడా వీల్లేకుండా ఉంది. ఎలాగైనా తన శరీరం మునపటిలాగ సన్నంగా చేయించుకోవాలని అతనికి బుద్ధిపుట్టింది. దానికేమైనా మందులుండకపోవని ఆలోచించి తన రాజ్యంలోని వైద్యులందరిని పిలిపించి, వారిని తనకు మందు ఇవ్వమన్నాడు.

తన శరీరాన్ని సన్నంగా చేస్తే వెయ్యి రూపాయలు బహుమానం యిస్తానన్నాడు.

బహుమానానికి ఆశపడి వైద్యులు ఎన్నో రకాల మందులిచ్చారు. కొందరు వైద్యులు అడవులు, తోటలు తిరిగి వనమూలికలను తెచ్చి, మందులుచేసి రాజుకిచ్చి తినమన్నారు. రాజు వాటినన్నిటిని తిన్నాడు. కాని శరీరం మునపటిలాగనే ఉంది. అందుచే రాజుకోపించి ఆ వైద్యులనందరిని జైల్లో పెట్టించాడు.

ఇది చూచి ఒక గడుసు వైద్యుడు రాజుదగ్గరకు వచ్చాడు. రాజు సభ చేస్తుండగా, ఎదుటకివచ్చి, రాజును చూచి, "రాజా నీ శరీరం యింక సన్నం కాదు సరిగదా నీవు ఆరునెలల్లో చచ్చిపోతావు." అని గట్టిగ చెప్పాడు.

ఇది విని సభలోవాళ్లంతా ఆశ్చర్యపోయారు. రాజుకు కోపంవచ్చింది. వెంటనే భటులను పిల్చి, అతణ్ణి బంధించమన్నాడు. రాజతనిని చూచి "నీవు చెప్పినట్లు ఆరు మాసాల్లో నేను చచ్చిపోకపోతే నిన్ను చంపించేస్తాను" అన్నాడు. వెంటనే భటులు అతన్ని జైల్లోపెట్టి ఉంచారు.

భాగవతుల కృష్ణమూర్తి
విశాఖపట్నం



అప్పటినుంచి, రాత్రిళ్ళు రాజునకు నిద్రపట్టటంలేదు. వైద్యుడు చెప్పిన మాటలే మాటిమాటికి జ్ఞాపకంవస్తున్నాయి తాను నిజంగా ఆరునెలల్లో చచ్చిపోతాను గాబోలు నని బెంగపట్టుకుంది. ఇంకా చాలాకాలం బ్రతకాలనీ, ఇంకా చాలా కాలం రాజభోగం అనుభవించాలనీ రాజుకు ఆశ ఉంది. కాని, వైద్యుడు, నిండు సభలో చెప్పినమాట, అబద్ధమవుతుందా! అందుచే బెంగ మనోవ్యాధిగా పరిణమించింది. క్రమంగా మంచమెక్కాడు.

క్రమంగా రాజు చిక్కిపోసాగాడు. వైద్యుడు చెప్పిన ఆరుమాసాల గడువు ఆ రోజుతో పూర్తి అయిపోయింది. కాని రాజుచనిపోలేదు. తానింక చనిపో ననుకొని రాజు, వైద్యుని తన ఎదుటికి రప్పించాడు. "ఇవాళతో పాపం వైద్యుడుపని సరి" అని సభలోనివారంతా అనుకున్నారు.

రాజు వైద్యుణ్ణి చూచి "ఏయ్! నీవు చెప్పిన ఆరుమాసాలు నేటితో తీరిపోయినాయి. కాని, నేను చావలేదు. కనుక నిన్ను చంపిస్తున్నాను" అన్నాడు.

వైద్యుడు, జంకకుండా "మహాప్రభూ! మీ ఆస్థాన వైద్యులూ, వారి మందులూ చెయ్యలేని పనిని, నా ఒక్కమాట చేసింది. కావలె నంటే 'తమ శరీరమును ఒకసారి చూచుకోండి. ఇదే నేను మీకు చేసిన చికిత్స'" అని చెప్పేడు.

రాజు తన శరీరమును చూచుకొని, మునపటికంటె చాల సన్నగా ఉన్నదని గ్రహించాడు. సభలోనివా రందరు, ఆశ్చర్యపోయి, వైద్యుడు చేసిన చమత్కారమునకు సంతోషించారు. రాజు, అతనికి వెయ్యి రూయిపాయలు బహుమానం యిచ్చి, జైల్లోంచి విడిపించాడు.




పూర్వం ఒక కొండగుహలో చోరదత్తుడు అనే దొంగల గురువు ఉండేవాడు. అతడు దొంగతనంలో అలె నేర్పరి. అతనికి ఎంతో మంది శిష్యులు. అందులో విమలుడనే వాడు కూడా ఒకడు ఉండేవాడు. ఒక రోజు చోరదత్తుడికి కుందేటి మాంసం తినాలని బుద్ధిపుట్టింది.

"ఒరేయ్, విమలా! నాకు కుందేటి మాంసం తినాలని మనసుగావుంది. నువ్వు అడివికివెళ్లి ఒక కుందేటిని పట్టి దాన్ని పక్వంచేసి తీసుకురా" అని చెప్పాడు.

విమలుడు సరేనని అడివికి వెళ్లి ఒక కుందేటిని పట్టి చంపి, దాన్ని బాగా కాల్చి తీసుకు వస్తూవుండగా అతనికి ఒక దుర్బుద్ధి పుట్టింది. ఆకలి జాస్తిగా ఉండటాన నోరు వూరి ఆ కుందేటి కాలు ఒకటి కొరికి తినివేసి, మిగిలిందాన్ని తీసుకొచ్చి గురువుకి సమర్పించాడు.

కుందేలుకు మూడే కాళ్లుండటం చూసి చోరదత్తుడు "ఇదేమిటబ్బాయి! ఈ కుందేటికి మూడు కాళ్ళే వున్నయ్-అసలు నువ్వు పట్టిన కుందేటికి మూడుకాళ్లేనా?" అని అడిగాడు.

విమలుడు జంకూ గొంకూ లేకుండా "అవును స్వామీ! నేను పట్టిన కుందేటికి మూడు కాళ్లే ఉన్నయ్" అని సమాధానమిచ్చాడు. అయితే చోరదత్తుడు మాత్రం తన శిష్యుడు చేసిన దొంగతనాన్ని దివ్యదృష్టితో గ్రహించాడు. అనాటినించీ వీడి పని పట్టాలని చోరదత్తుడు తీర్మానించుకున్నాడు.

ఒకరోజు చోరదత్తుడు, శిష్యుణ్ణి పిలిచి "ఒరేయ్ విమలా! నాకు రాజుగారు భోజనంచేసే ఆహారం నువ్వు తెచ్చిపెట్టాలి. ఇదుగో ఈ కాటుకతీసి కొంచెం కళ్ళ

వేణుగోపాల్, మద్రాసు





రెప్పలకి రాచుకున్నావంటే ఇంక నువ్వు మరెవ్వరి కళ్ళకీ కన్పించవు. త్వరగా వెళ్లి రాజుగారి భోజనం తీసుకురా!" అని ఆజ్ఞాపించాడు.

విమలుడు సంతోషంతో తనకుగూడా రాజుగారి భోజనం చిక్కుతుందికదా అని చంకలు కొట్టుకుంటూ గురువు ఆజ్ఞ ప్రకారం రెప్పలకు కాటుక పూసుకుని రాజభవనంలో ప్రవేశించాడు. అక్కడ అప్పుడే రాజుగారికోసం తయారైన భోజనాన్ని ఎవ్వరికీ తెలియకుండా చేత బట్టుకొని బయటికి వచ్చేశాడు.

దారిలో వస్తూ రాజుగారి భోజనాన్ని కాస్తరుచి చూశాడు. బలేరుచిగా ఉండటం వల్ల సగంభాగం తనే తినేసి మిగతా దాన్ని గురువుగారికి సమర్పించాడు. అనాటినించి రోజూ వాడు ఈ విధంగానే చేస్తూవస్తున్నాడు.

దొంగతనం సంగతి రాజుగారికి తెలిసింది. వంట బ్రాహ్మలనడిగితే తమకీ సంగతేమీ తెలియదన్నారు. రాజుగారికి కోపం మరింత ఎక్కువై, సేవకుల్ని పిలిపించి "నా భోజనాన్ని దొంగిలిస్తున్న దొంగ నెవరు పట్టిస్తారో వాళ్ళకి పెద్ద బహుమానం ఇస్తాము అని" దండోరా వేయించమన్నాడు. అయితే దొంగను పట్టివ్వడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు.

చివరికి ఒకరోజున చోరదత్తుడు రాజుగారి దగ్గరికెళ్లి "ప్రభూ! ఆ దొంగను నేను పట్టిస్తాను. మీకు వండే ఈ రోజు ఆహారంలోమాత్రం మిరప్పొడి, పులుపు, కారం, అన్నీ కొంచెం ఘాటుగా తగిలించండి. ఆ తర్వాత దొంగ సులభంగా చిక్కిపోతాడు" అని చెప్పి వెళ్ళిపోయాడు.





రాజాజ్ఞప్రకారం ఆనాటి వంటకాలన్నీ కారంగానే తయారయినై. విమలుడు మామూలుప్రకారం ఆ రోజుకూడా వంట గదిలోకి వెళ్లి రాజుగారి అన్నం సగం తిని మిగతాదాన్ని మూటగట్టే సమయానికి, కూరలలోవున్న కారపు ఘాటుకు అతని కళ్ళ వెంబడి నీళ్లు ధారలుగా కారసాగినై. దానితో రెప్పలకి రాచుకున్న కాటుక కాస్తా కొట్టుకుపోయింది. వెంటనే దొంగ బయలుబడ్డాడు. అతన్ని చూసి సేవకులందరూ గట్టిగా పట్టుకుని రాజుదగ్గరికి లాక్కువెళ్ళారు. వాడిమీద రాజద్రోహం చేసిన నేరం మోపి వాడికి ఉరిశిక్ష విధించారు.

ఈ లోపుగా ఈ సంగతి, చోరదత్తుడికి తెలిసి అక్కడికి పరుగెత్తు కొచ్చాడు. ఇప్పటికైనా వాడు నిజం చెప్పుతాడనే నమ్మకంతో "ఒరే విమలా, ఇప్పుడన్నా నిజంచెప్పు, నువ్వు పట్టిన కుందేటికి మూడు కాళ్లేనా?" అని అడిగాడు.

శిష్యుడు నిర్భయంగా "అవును స్వామీ, నేను పట్టిన కుందేటికి మూడే కాళ్లు" అని అన్నాడు. ప్రాణం పోబొయ్యే సమయంలో కూడా తనమాట నిలబెట్టుకున్నందుకు చోరదత్తుడు విమలుణ్ణి మెచ్చుకుని రాజు గారితో చెప్పి అతనికి శిక్ష తప్పించాడు.

చోరదత్తుడుమాత్రం తన శిష్యుడిచేత ఎలాగైనా నిజం పలికించాలని తీవ్ర ప్రయత్నం చేస్తుండేవాడు. దీని నిజం కనుక్కోమని చోరదత్తుని భార్యతోకూడా చెప్పివుంచాడు. ఒక పౌర్ణమి నాటి రాత్రి విమలుడు తన యింట్లో భార్యతోకూడా సరస సల్లాపాలు ఆడుతున్నాడు. ఆ సమయానికి చోరదత్తుడు

శిష్యుడి ఇంటివెనుక నిలబడి పొంచిఉండి వింటున్నాడు. విమలుడి భార్య మాటల సందర్భంలో తనభర్తను "ఏమండీ ఆ చంద్రబింబం మధ్యలో ఏదో ఒక జంతువులాగ కనిపిస్తున్నదే, అదేమి టండీ?" అని అడిగింది.

"అదా? నాలుగుకాళ్ళ కుందేలు" అన్నాడు విమలుడు.

"నాలుగుకాళ్ళ కుందేలు కాక మూడు కాళ్లవి కూడా వుంటయ్యా ఏమిటి?" అని అడిగింది ఆవిడ.

"సాధారణంగా అన్ని కుందేళ్ళకీ నాలుగు కాళ్లే ఉంటయ్; కాని నేను పట్టిన కుందేటికిమాత్రం మూడేకాళ్ళు" అని అన్నాడు విమలుడు.

ఇంటివెనుక పొంచివుండి వింటున్న చోరదత్తుడు శిష్యుడి మాటలు విని ఆశ్చర్యపోయాడు. శిష్యుడు ఎంత కష్టంలో ఉన్నా, ఎంత సంతోషంలో ఉన్నా ఒక్కటే మాటమీద నిలబడి మాట్లాడుతున్నందుకు సంతోషమేసింది. తనకు కావలిసింది ఇటువంటి దొంగ శిష్యుడే కదా అనుకుని శిష్యుడి దగ్గరికి వచ్చి "విమలా, మీ




సంభాషణంతా ఇప్పుడే విన్నాను. నువ్వు చాలా సమర్థుడివి. అన్నమాటను ఎప్పుడూ నిలబెట్టుకుంటావు. అసలు దొంగతనానికి మొట్టమొదట నేర్చుకోవలసింది ఇదే! కాబట్టి ఇకమీదట నువ్వే స్వతంత్రంగా దొంగతనం చేసుకుని సుఖంగా వుండు" అని చెప్పి దీవించి చోరదత్తుడు తన మామూలు గుహకి వెళ్లిపోయాడు.

కథ చెప్పినవాళ్లకు చాటెడు బంగారం విన్నవాళ్లకి వీశెడుబంగారం.



# వెఱ్ఱి వెంకన్న

పూర్వం గౌరయ్యపాలెం అనే గ్రామంలో వీరన్న అనే ఒక వెలమ కులస్థుడుండేవాడు. అతడు, తలిదండ్రులు లేని ఒక పిల్లవాడిని చేరదీసి పెంచుతుండేవాడు. ఆ పిల్లవాడి పేరు వెంకన్న. వెంకన్న, పాపం వట్టి వెఱ్ఱిబాగులవాడు. వీరన తన యింట్లో పనిపాట్లన్నీ వెంకన్న చేత చేయించుకునేవాడు.

ఒకరోజున వీరన్న భార్య అయిన వీరమ్మ వెంకన్నని బజారుకుపోయి ఒక వంద మామిడిపళ్ళు పట్టుకురమ్మంది.

వెంకన్న మామిడిపళ్లు కొనుక్కొని, కొట్టువాడిచ్చిన రశీదు కూడా బుట్టలో పెట్టుకుని యింటికి వస్తున్నాడు. కొంత దూరం వచ్చేసరికి వాడికి ఆ పళ్ళలో ఒక పండు తినాలని నోరూరింది. వెంటనే ఒక పండు తీసుకుని "యిన్ని పళ్ళలో ఒక్క పండు తగ్గితే మా వీరమ్మగారి కెలా తెలుస్తుందిలే" అనుకుని తిని, మిగతా పళ్ళు తెచ్చి వీరమ్మకిచ్చాడు.

వీరమ్మ పళ్ళు లెక్కబెట్టి చూచుకుంది. ఒక పండు తగ్గింది. "నువ్వేమైనా కాజేసి తిన్నావేరా!" అని అడిగింది.

"నేను ఒక పండు తిన్నమాట నిజమే గానండి, మరి మీకెలా తెలిసిందండీ?" అని అడిగాడు వెంకన్న.

"ఎలా తెలిసేదేమిటిరా, నీ మొహం! రశీదే చెబుతోంది. ఫో! ఇకముందెప్పుడూ దొంగతనం చెయ్యకని" చివాట్లుపెట్టింది.

మరికొన్నిరోజులు గడిచినై. వీరమ్మ మళ్లీ వెంకన్నని బజారుకు పంపింది పళ్లు పట్టుకురమ్మని. వెంకన్న పళ్లు కొనుక్కొని తిరిగి వస్తూ యిలా అనుకున్నాడు–"క్రిందటిసారి రశీదు బుట్టలో వుండటాన నేను ఒకపండు తిన్న సంగతి రశీదు చూసి వీరమ్మగారితో చెప్పింది. ఈసారి దీన్ని మట్టిలో పూడ్చిపెట్టి అది చూడకుండా తింటాను" ఇలా అనుకుని వెంకన్న, కొట్టువాడిచ్చిన రశీదును మట్టిలో పాతిపెట్టి దానిమీద తన కాలుతో

భద్రమహంతి కమల, మహలక్ష్మి, జబల్పూర్.

మూసిపెట్టి, బుట్టలోవి రెండు పళ్లు గబగబా తిని. తర్వాత రశీదు తీసుకుని మిగతా పళ్ళతో. యింటికి వచ్చాడు.

వీరమ్మ మళ్లీ రశీదుప్రకారం పళ్ళని లెక్కబెట్టింది; రెండు తక్కువైనై. "ఏరా, వెధవా. ఈసారికూడా కాజేసి తిన్నావా ఏమిటి? రెండు తక్కువైనై" అని అడిగింది.

వెంకన్న తెల్లబోయాడు. "అమ్మగారూ, సగందూరం వచ్చేసరికి. ఆకలివేసిందండీ అంచేత రెండుపళ్ళు తిన్నాను. అది సరేగానీండి; నేను రశీదుని మట్టిలో కప్పి పెట్టి అది చూడకుండా తిన్నానుగదా, ఈ సారి మీకెలా తెలిసిందండీ!' అని అడిగాడు.

"ఓరి వెఱ్ఱివెధవాయా, ఈసారీ రశీదే చెప్పిందిరా" అని వీరమ్మ "యికనించీ నిన్ను బజారికి పంపనులే. యింట్లో పనులే చేస్తూ అఘోరించు" అని కసిరింది.

ఇలా వుంటుండగా ఒకరోజున వీరమ్మ వెంకన్నని పిలిచి, "ఒరే, మన యింటి చుట్టూ ఒక మాయదారి పిల్లి తిరుగుతూ వుంది. మన కోడినీ, పిల్లల్నీ అది ఎత్తుకు పోకుండా జాగ్రత్తగా చూస్తూవుండు." అని చెప్పింది. వెంకన్న సరేనని తలవూపి ఆ రోజల్లా జాగ్రత్తగా కోడినీ దాని పిల్లల్నీ చూస్తూవున్నాడు. కాని ఆరాత్రి నిద్ర వచ్చే వేళకి కోడిపిల్లలన్నిటి కాళ్ళకీ కలిపి ఒక తాడుకట్టి ఆ తాడు తను పడుకున్న



మంచంకోటికి కట్టి నిశ్చింతగా నిద్రపోయాడు. ఒకరాత్రివేళకి పిల్లివచ్చి, ఆత్రాడు కాస్తా కొరికి కోడిపిల్లల్ని ఎత్తుకుపోయింది.

తెల్లవారి వీరమ్మ లేచి చూసుకుంటే కోడిపిల్లలు లేవు. "ఏరా వెంకా, కోడిపిల్ల లేవిరా?" అని అడిగింది.

"ఏమోనండీ, రాత్రి పడుకోబోయేటప్పుడు వాటన్నిటి కాళ్ళకీ కలిపి ఒక తాడు కట్టి నా మంచంకోటికి కట్టాను. మరి పిల్లి ఎత్తుకుపోయిందెమో?" అన్నాడు.

"ఓరి నీ తెలివి మండా! తాడు కట్టినంత మాత్రాన పిల్లి ఎత్తుకుపోకుండా వూరుకుంటుందిరా?" అని మళ్లీ చీవాట్లు పెట్టింది.



ఇలాగే వెంకన్న ఎప్పుడూ ఏదో ఒక తెలివితక్కువపని చేస్తూ ఎప్పుడూ వీరమ్మ చేతలో చీవాట్లు తింటుండేవాడు. అప్పుడప్పుడు దేహశుద్ధికూడా జరుగుతుండేది.

* * *

మరికొన్నాళ్ళు గడిచినై. వీరమ్మ కడుపుతోవుంది. ఆమె పుట్టింటివారు సూడిదలని చెప్పి, ఆమెకి ఒక బుట్టెడు సున్నివుండలు, ఒక బుట్టెడు చలిమిడీ పంపారు. ఈ సంగతి వెంకన్నకి తెలిస్తే వాడు అదంతా ఎక్కడ మింగిపోతాడోనని వీరమ్మ ఆ రెండు బుట్టలూ పుట్టిమీదపెట్టి, వెంకన్నని పిలిచి, "ఒరేయ్, ఆ పుట్టిమీద బుట్టలోది విషం. ఏదో తినేదనుకుని తినేవ్‌సుమా, చెప్పా పెట్టకుండా ఛస్తావ్" అని చెప్పింది.

మళ్ళీ మామూలుగా రోజూ తిట్లు, దెబ్బలూ తప్పటంలేదు వెంకన్నకి. చివరికి ఒకరోజు వాడికి ప్రాణంమీద విసిగెత్తింది. "ఇలా బ్రతకటంకంటె చావటం మంచిది. అమ్మగారు పుట్టిమీద విషంవుందని చెప్పారుకూడా. అది కాస్తా తినేశానంటే యివాల్టితో నాకు ఈ బాధలు తప్పుతై" అనుకున్నాడు. వెంటనే ఎవ్వరూ లేకుండా చూసి పుట్టిలోవున్న రెండు బుట్టల్లోవున్న చలిమిడీ, సున్నివుండలూ రెండుచేతులా తినటం మొదలెట్టాడు.

ఇంతలోకే వీరన్న అక్కడికొచ్చాడు. వీరన్నని చూచి గాబరాపడ్డాడు వెంకన్న. వీరన్న "ఏమిటిరా అలా పుక్కరి బిక్కరవుతున్నావ్?" అని అడిగాడు.

నోట మాట రాకపోవటంవల్ల వెంకన్న నీళ్ళుకావాలని చేత్తో సైగచేశాడు. వెంటనే వీరన్న నీళ్ళు తెచ్చి యిస్తే, అవి తాగి, తెప్పరిల్లుకుని వెంకన్న యిలా చెప్పాడు:

"ఏంలేదండీ! నా బ్రతుకు రోజు రోజుకీ అధ్వాన్నం అయిపోతోంది; ఏరోజూ తిట్లు తినంది లేదు. అంచేత ప్రాణంమీద విసిగెత్తి చద్దామనిపించింది. పుట్టిమీద విషం వుందని అమ్మగారు చెప్పారు చావటానికని ఆ విషమంతా యిప్పుడు తినేశా."



వీరన్నకేమీ అర్థంకాలేదు. వెంటనే భార్యనిపిలిచి "ఏమే, పుట్టిమీద విషం వుందని చెప్పావుటేమిటి?" అని అడిగాడు. వెంటనే వీరమ్మ పుట్టికేసి చూస్తే అక్కడే వుంది, కాళీబుట్టలు రెండూ పుట్టిక్రింద పడేసివున్నై. "ఓరి నీ కడుపుడకా, నీతో ఏది చెప్పినా చావుగానే వుందిరా" అని ఆవిడ జరిగినదంతా భర్తతో చెప్పింది. అంతా తెలుసుకుని వీరన్న కడుపు చెక్కలయ్యేట్టు నవ్వాడు.

* * *

మరికొన్నాళ్ళు గడిచినై. వీరన్న కొడుకు పెళ్ళి. వీరన్న తన చుట్టపక్కాలతో రెండెడ్ల బళ్ళమీద పెళ్ళికూతురి వారి వూరికి రాత్రి భోజనలయాక బయలుదేరారు. వెంకన్న కూడా బయలుదేరాడు. అప్పుడు వీరన్న వెంకన్నని పిలిచి, "ఒరే, నువ్వు బళ్ళ వెనకాలే నడిచివస్తూ వుండు. ఏ బండీ లోంచి కూడా ఒక్క పూచికపుల్ల క్రింద పడకుండా వెయ్యికళ్ళతో చూస్తూవుండాలి సుమా" అని చెప్పాడు. వెంకన్న సరేనన్నాడు.

బళ్ళలో అంతా గాఢనిద్రలు పోతున్నారు. వెంకన్న మాత్రం బళ్ళవెంట నడిచి వస్తున్నాడు. ఇంతలో ఒక బండికి కట్టిన ఎద్దులు పేడకడివేసినై. వెంకన్న ఆ చీకట్లో అది పేడకడి అని తెలియక, దాన్ని ఎత్తి జాగ్రత్తగా, బండిలో నిద్రపోతున్న వారి తలలక్రింద పెట్టి, తిరిగి బళ్ళవెంట నడుస్తున్నాడు. మరికాసేపటికి మరోబండి ఎద్దులు పేడకళ్ళు వేసినై. వాటినికూడా ఎత్తి జాగ్రత్తగా ఆ బండిలో నిద్రపోతున్న వాళ్ళ తలలక్రింద పెట్టాడు. ఈవిధంగా ఏ బండి ఎద్దులు పేడకడి వేస్తే అది ఎత్తి ఆ బండిలో పడుకున్న వాళ్ళ తలలక్రింద పెడుతూ వచ్చాడు.

తెల్లవారేసరికి అంతా లేచారు. ఒకరినొకరు చూచుకున్నారు. "నీ తలకి పేడ ఎలా అంటిందంటే నీ తలకి ఎలా అంటిందని" ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు. అఖరికి వెంకన్నని పిలిచి అడిగారు.




"వీరన్నగారు చెప్పినట్టే చేశాను. ఒక్క పూచికపుల్లకూడా క్రిందపడకుండా చూస్తుండమన్నారు, అలాగే చేశాను" అన్నాడు.

"ఓరి వెఱ్ఱివెధవా, నీ తెలివి తెల్లారినట్టే వుంది. అసలు నిన్ను మాతో తీసుకు రావట౦ మాదే పొరపాటైంది." అనుకుని పెళ్లివారి వూరు చేరారు.

పెళ్లికొచ్చిన వాళ్ళంతా చేరి వె౦కన్నని కోతిని ఆడించినట్లు ఆడించారు. పెళ్లి ఆఖరు రోజున అందరితోపాటు వెంకన్నకి కూడా పెళ్లివారు కొత్తబట్టలు పెట్టారు. వెంకన్న ఆ బట్టలు కట్టుకుని అక్కడ ఒక నిలువుటద్దంవుంటే దాంట్లో చూసుకున్నాడు. తన మామూలు వెఱ్ఱిమొహానికీ యిప్పుడు అద్దంలో కనపడుతున్న మొహానికీ తేడా కనిపించింది. ఇంకేముంది? "తల్లీ తండ్రీ లేని వెంకన్నని ఎక్కడో వదిలి, వీడినెవడినో కొత్త మొహాన్ని యిక్కడకు తెచ్చారు బాబూ" అని రాగాలు దియ్యటం మొదలెట్టాడు. ఇది విని యింటిల్లిపాదీ వచ్చి వెంకన్నచేత ఆ బట్టలు విప్పించి మామూలు బట్టలు కట్టించి మళ్లీ అద్దంలో చూపించారు. అప్పటికి స్థిమితపడ్డాడు మన వెఱ్ఱివెంకన్న.

పెళ్లి అయాక మళ్లీ ఎవరిళ్లకు వాళ్లు చేరుకున్నారు. ఒకసారి పెళ్లికూతురు వారి క్షేమసమాచారాలు తెలుసుకురమ్మని వెంకన్నని పంపారు. వెంకన్నని పంపేటప్పుడు వీరమ్మ యిలా చెప్పింది, "ఒరే, నోటికివచ్చిందల్లా వాగబోకు. ముక్తసరిగా మూడు మాటలు మాట్లాడి వచ్చెయ్యి" అని.

వెంకన్న పెళ్లికూతురువారి యిల్లు చేరుకున్నాడు. వాళ్లు వెంకన్నకి కాళ్లు కడుక్కోటానికి నీళ్లిచ్చి, "అక్కడ మావాళ్లంతా క్షేమంగా వున్నారా?" అని అడిగారు. "వున్నారు" అని జవాబు చెప్పాడు వెంకన్న.

"వర్షాలు బాగా వున్నయ్యా?" అని అడిగారు. "వున్నై" అని జవాబిచ్చాడు.

"పంటలు బాగా పండుతున్నయ్యా?" అని అడిగారు. "పండుతున్నై" అన్నాడు.

తర్వాత ప్రశ్న, "మా అల్లుడు కులాసాగా వున్నారా?" అని అడిగారు. వీరమ్మ తనని మూడు మాటలకంటే ఎక్కువ మాట్లాడవద్దని చెప్పింది కనక, వెంకన్న ఈ నాలుగో ప్రశ్నకి ఏమీ జవాబు చెప్పకుండా బెల్లంకొట్టిన రాయిలా కూచున్నాడు. "మా అల్లుడు కులాసాగా వున్నారా?" అని మళ్లీ అడిగారు. కాని, ఈసారికూడా వెంకన్న నోరుతెరిచి జవాబు చెప్పకపొయ్యేసరికి యింటిల్లిపాదికీ అనుమానంవేసింది. ఒక వేళ తమ అల్లుడికి ఏమీ జబ్బుచెయ్యలేదుగదా అని! అంచేత "ఏం నాయనా, మాట్లాడవెందుచేత? మా అల్లుడి కేమైనా జబ్బుగ వుందా?" అని అడిగారు.

కాని, నాలుగోమాట మాట్లాడితే ఏమి కొంపమునుగుతుందోనని, వెంకన్న ఈసారి కూడా ఏమీ సమాధానం చెప్పలేదు. ఇది చూసి ఇంటిల్లిపాదీ ఏడుపులు, పెడబొబ్బలు మొదలెట్టారు. వెంకన్న కూడా వాళ్ళతోపాటుగా ఏడవడం మొదలెట్టాడు. ఇది చూసి, తమ అల్లుడు చనిపోయే వుంటాడనీ, అంచేతనే ఆ సంగతి చెప్పలేక వెంకన్న యింతసేపూ ఎన్నిప్రశ్నలడిగినా జవాబుచెప్పక చివరికి తమతో పాటు ఏడుస్తున్నాడనీ తెల్సుకున్నారు.




ఇంకేం, "నీకెంత ఖర్మం వచ్చిందే తల్లీ," అంటూ పాపం ఆ పెళ్ళికూతురి మెళ్ళో మంగళసూత్రం అవి తెంపివేసి అంతా ఆ పిల్లచుట్టూ చేరి ఒకే గోలగా ఏడవటం మొదలెట్టారు.

వెంకన్నకి యిదేమి అర్థంకాక చల్లగా మళ్లీ తనవూరు తిరిగివచ్చి వీరమ్మతో జరిగినదంతా చెప్పాడు. అంతా విని వీరమ్మ వెంకన్నమీద మండిపడింది. ఒళ్ళు వాచేదాకా చితకగొట్టి "యికనించీ నిన్ను బయటికి పంపిస్తే ఒట్టే. ఇంట్లోనేపడి చావు" అని నాలుగు తిట్టి, పెళ్ళికూతురువారి వూరికి యిలా జరగటానికి వెంకన్న వెఱ్ఱిబాగుల

తనమే కారణమని, కబురుచేసింది. ఇది విన్న పెళ్ళికూతురు తరఫువారు కడుపు చెక్కలయ్యేట్టు నవ్వుకున్నారు.

* * *

మరికొన్ని రోజుల తర్వాత, ఒకనాడు వీరన్న, వీరమ్మ కొడుకుతోసహా పెళ్ళి కూతురువారి గ్రామం ప్రయాణమయ్యారు. ఇంటిదగ్గిర కాపలాగా వెంకన్నని వుంచి, వీరన్న వెంకన్నని పిలిచి "ఒరే వెంకూ! మేము తిరిగి వచ్చేవరకూ జాగ్రత్తగా యిల్లు చూసుకుంటూవుండు. ఒక్క చీమ కూడా దూరకూడదు అని చెప్పాడు. 'అలాగే చూస్తాండీ' అన్నాడు వెంకన్న.

వీరన్న వాళ్ళు వెళ్ళిపోయిన మర్నాడు వెంకన్న వరండాలో పడుకున్నాడు. ఒక గోడమీద చీమలు బారులుతీర్చి పోతున్నై.

'ఒక్క చీమని కూడా యింట్లో దూరనివ్వకూడదని మా వీరన్నగారు అంత యిదిగా చెప్పి వెళ్ళారు. ఇప్పుడిన్ని చీమలు బారులుతీర్చి పోతున్నై, ఎలాగా'' అని ఆలోచించాడు. వెంటనే వెంకన్నకి ఒక ఆలోచన తట్టింది. లేచివెళ్ళి ఆ చీమలనన్నిటిని చంపి పారెయ్యటం మొదలెట్టాడు.

కాని ఎన్నిటిని చంపినా యింకా కొత్తగా చీమలు వస్తూనేవున్నై. "ఇలా కాదు. ఇంటికి నిప్పంటిస్తేసరి. చీమలన్నీ ఒక్కటికూడా లేకుండా మాడి చస్తయి" అనుకుని, యింటికి నిప్పు అంటించాడు.

ఇల్లు తగలబడుతోంటే దాంట్లోని కర్రాగిర్రా చిటపట మంటుండటం విని చీమలే అలా చిటపటమని చస్తున్నయ్యనుకుని వెంకన్న చాల సంతోషించాడు. ఇల్లంతా కాలి బూడిద అయిపోయింది.

ఆ తర్వాత రెండు రోజులకి వీరన్నవాళ్ళు తిరిగివచ్చి చూసుకుంటే ఏముందీ ఇల్లంతా పూర్తిగా కాలిపోయివుంది. వీరన్నకి పట్టలేనంత కోపంవచ్చింది. వెంటనే పడుకుని వున్న వెంకన్నని ఛడామడా తన్ని, "ఇలా ఎందుకు జరిగింద"ని అడిగారు. వెంకన్న ఏడుస్తూ జరిగినదంతా చెప్పాడు.

"ఛీఛీ, ఛండాలుడా. నువ్వు చేస్తూ వచ్చిన తప్పులకు, నిన్ను యింతకాలం క్షమిస్తూ మా యింట్లో వుంచుకోటం మాదే బుద్ధితక్కువ. ఇప్పటికి మాకు బాగా బుద్ధిచెప్పావు. ఇక నీ కర్మాన నువ్వుపో" అని అక్కడినించి వెళ్ళగొట్టారు.






# ఎవరు తెలివిమంతులు

పూర్వం ఒక వూళ్లో ఒక పిసినిగొట్టు ఉండేవాడు. అతను పిల్లికికూడా భిక్షంపెట్టి ఎరుగడు. అంచేత అతనంటే ఆ వూళ్లో వాళ్ళ కెవ్వరికీ గిట్టదు. అలాంటి పిసినిగొట్టుకి ప్రక్కవూళ్లో ఇంకో పిసినిగొట్టు స్నేహితుడు వున్నాడు. అతను ఎలాంటి వాడో తెలుసా? ఎంగిలిచేతుల్ని నీళ్ళతో కడుక్కుంటే చేతి జిగట వృధాపోతుందని నోటితోనే బాగా చప్పరించి శుభ్రంచేసుకునే వాడు. అతని భార్యకూడా అలాంటి రకం మనిషే.

ఒకరోజు పిసినిగొట్టు పిచ్చయ్య తన స్వంత పనిమీద ప్రక్క ఊరికి పోవాల్సి వచ్చింది. అక్కడ పని పూర్తి అయినాక భోజనానికి ఎక్కడికి వెళ్లటమా అని ఆలోచించాడు. పూటకూళ్ళ యింటికి వెళ్లితే డబ్బు దండుగ అవుతుందని సరాసరి తన పిసినిగొట్టు స్నేహితుడింటికి తిన్నగా వెళ్ళాడు.

పిచ్చయ్యను చూడగానే స్నేహితుడి గుండె బిక్కుమన్నది. కాస్త ధైర్యం తెచ్చుకొని "ఏమండీ ఎప్పుడొచ్చారు? ఏమిటి విశేషాలు?" అని పలకరించాడు.

"మరేం విశేషాలు లేవు. నిన్ను చూడాలని బుద్ధి పుట్టింది - వచ్చాను" అన్నాడు పిసినిగొట్టు పిచ్చయ్య.

వచ్చినపీడ పోయేటట్లు లేదనుకుని "మంచిదే లెండి, భోజనం వేళయింది - దొడ్లో కెళ్లి స్నానంచేసి రండి" అని అన్నాడు పిసినిగొట్టు స్నేహితుడు. సరేనని పిచ్చయ్య స్నానంకోసం దొడ్లో కెళ్లాడు.

'ఒకపూట అన్నం ఎలాపెట్టడమా?' అని స్నేహితుడు ఆలోచనలో పడ్డాడు. అతని భార్యకూడా అతనితోపాటు ఆలోచనలో పడి, "ఏమండోయ్, నాకో యోచన తోస్తోంది - అలా చేశామంటే ఆ పిచ్చయ్య చెప్పకుండా వెళ్లిపోతాడు. నేను వంటగది లోకి వెళ్లి కూర్చుంటాను. మీరు ఒక తాటి

బి. నరసింహప్రసాద్, నెల్లూరు.




పట్ట తీసుకొచ్చి నన్ను కొట్టినట్టుగా పట్టను నేలకేసి కొట్టండి. నేను 'కుయ్యో మొఱ్రో' అని శోకాలు పెడతాను. వాడు మన వ్యవహారం చూసి ఇంటిదారి పడతాడు!'' అని చెప్పింది.

భర్త సంతోషముతో "బలే చక్కటి ఉపాయం చెప్పావు. లేకుంటే వచ్చేపొయ్యే పుల్లయ్యలకంతా వండి పెట్టడానికి ఇదేం సత్రం గిత్రం అనుకున్నావా ఏమిటి'' అని గొణిగాడు. ఆ తర్వాత, అనుకున్న ప్రకారం ఇద్దరూ నడవడలచుకున్నారు.



ఈ సంగతంతా దొడ్లో స్నానంచేస్తున్న పిచ్చయ్య విన్నాడు. 'ఓరి దద్దమ్మలూ! నేనుమాత్రం మీకన్నా తక్కువ తిన్నాను గనుకనా మిమ్మల్ని వదిలిపెట్టటానికి! ఈరోజు ఎలాగైనా సరే మీ యింట్లో ఒక్క పూటన్నా తినకుండా వెళ్ళను. దీంట్లో నాసామర్థ్యమో, మీ సామర్థ్యమో బైట పడాలి!'' అని అనుకుని స్నానం ముగిసిన తర్వాత నేరుగా యింట్లోకి వెళ్ళి భోజనం కోసం కూర్చున్నాడు.

పిసినిగొట్టు పిచ్చయ్య ఇంట్లోకిరావడమే తడవుగా వంటయింట్లో వున్న స్నేహితుడు తాటపట్ట నేలకేసి 'టపీ,టపీ'మని కొడుతూ "ఇప్పటికైనా నామాట వింటావా, చెప్పు? నా స్నేహితుడికి అన్నం వడ్డించమంటే కాదంటావా? ఊ-చెప్పు; లేకపోతే నీ ప్రాణం తీస్తాను చూడు'' అని అరుస్తూ భార్యని కొట్టినట్టు పెద్దరభస చేశాడు.

ఇలా భర్త పట్టను నేలకేసి కొడుతూంటే భార్య తన్ను నిజంగా కొడుతూన్నట్టుగా అభినయిస్తూ "అయ్యో! అమ్మో! ఈ అన్యాయాన్ని విచారించే వారు లేరా! నన్ను చంపుతున్నాడే! నన్ను కాపాడే దిక్కు ఎవరూ లేరా? అయ్యో, బాబో!'' అని రాగాలు పెట్టడం ప్రారంభించింది.





పిచ్చయ్యకి వీళ్ల నటన తెలుసు, కాబట్టి ఈ సమయంలో ఇక్కడ ఉండటం మంచిదికాదని కండువా భుజానవేసుకుని బయటికి వెళ్లినట్టు వెళ్ళి చప్పుడుగాకుండా దొడ్లకి జొరబడి ఇంటివెనక దాక్కున్నాడు.

ఇంతలో స్నేహితుడు తన భార్యను పిలిచి "చూశావా, నా మంత్రం ఎంతపని చేసిందో! ఆ పీనాసివెధవ మన గోల సహించలేక వెళ్లిపోయాడు. ఇదంతా నా తెలివితేటలు! లేకుంటే వాడు వదిలే వాడు కాదు' అని సంతోషం పట్టలేక నవ్వాడు.

"దీంటో మీరు చేసిన దేముంది? మీరు కొట్టిన ఉలుత్త దెబ్బలకు తగినట్టుగా నేను రాగాలు తీయకుంటే మీ తెలివితేటలు బట్టబయలైపోయేవి. మీరు కొట్టినట్టు కొట్టారు. నేను ఏడ్చినట్టు ఏడ్చాను. నా గోలకి భయపడి ఆ పిసినిగొట్టు పిచ్చయ్య కాలికి బుద్ధిచెప్పాడు. అంచేత మీకన్నా నేనే తెలివిగలదాన్ని" అని వెటకారంగా నవ్విందావిడ.

వీళ్ల వాదన అంతా గోడచాటునుంచి విన్నాడు పిచ్చయ్య. చల్లగా ఇంట్లోకివచ్చి "మీలో మీరే తెలివిగలవాళ్ళమనుకుంటే ఎలా? నువ్వు నీ భార్యను కొట్టినట్టు కొట్టావు. ఆవిడ ఏడ్చినట్టు ఏడ్చింది. నేను వెళ్లినట్టు వెళ్లి మళ్లీ వచ్చేశాను. కాబట్టి ఇప్పుడు మీకంటే నేనే తెలివిగలవాణ్ణి!" అని అంటూ చరచరా వంటగదిలోకి వెళ్లి, ఆ కుండలోని అన్నం, చట్టిలోని కూర, తన ఇష్టమొచ్చినంత వడ్డించుకుతిని, వాళ్లకేమీ చెప్పకుండా 'బేవు' మని త్రేపు కుంటూ వెళ్లిపోయాడు.

ఇక ఆనాటినించీ ఆ భార్యాభర్త లిద్దరూ అతిథి వచ్చాడంటే అసలు తలుపే తీసే వారు కాదు.




# గోరక్‌నాధ్

కబీరు మహమ్మదీయుల పిల్లవాడు. అతను బాల్యమునుండీ, హిందువుల పురాణాలు, కథలూ శ్రద్ధతో వింటూ ఉండేవాడు. కబీరు తల్లి దండ్రులు బట్టలు నేసి బ్రతికేవారు. అతనికి చిన్నతనము నుండీ రాముని మీద భక్తి కలిగింది. ఆ గ్రామంలోనే రామానందు డను భక్తుడు తన శిష్యులకు చదువు చెప్పేవాడు. కబీరుకు అతనివద్ద ఉపదేశము పొందవలెనని బుద్ధిపుట్టింది. వెంటనే అతడు రామానందులవారి ఆశ్రమానికి వెళ్లేడు. రామానందుని శిష్యులు కబీరు తురకబాలుడు అని ఆశ్రమంలోకి రానీయకండా కొట్టి తరిమివేశారు. కబీరు ఏడుస్తూ యింటికిపోయి రామానందునివద్ద ఉపదేశము పొందుటకు ఉపాయ మాలోచించసాగాడు.

అలా ఆలోచిస్తూపోగా కబీరుకు ఒక ఉపాయం తోచింది. రామానందుడు ప్రతి దినము స్నానముచేయు ఘట్టమువద్దకు ఆ రాత్రి వెళ్లి, మెట్లపై పడుకొన్నాడు. తెల్లవారకముందే స్నానముచేయుటకు వచ్చిన రామానందుడు, చీకటిలో కబీరుపై అడుగు వేశాడు. ఎవరో పిల్లవానిని తొక్కివేశాను గదా అని, ఆ పాపము పోవుటకు రామానందుడు "రామమంత్రము" స్మరించాడు. వెంటనే కబీరు ఆనందముతో లేచి, రామానందునిపాదములకు నమస్కారము చేశాడు. కబీరుపట్టుదలకు, భక్తికి మంచి గుణాలకు రామానందుడు సంతోషించి, ఆ రోజు నుండీ అతనిని తన శిష్యులలో చేర్చుకొన్నాడు.

కంచర్ల చినగురువుశెట్టి, విశాఖపట్నం





ఆ కాలంలో గోరక్‌నాథుడనే సిద్ధుడుండేవాడు. అతను ఎరుగని విద్యలు కాని, మాయలు కాని లేవు. అతనికి తెలియని మంత్రములు, తంత్రములు లేవు. అతడు ఎక్కడకు వెళ్లాలంటే అక్కడకు తన శిష్యులతోసహా, ఆకాశమార్గమున వెళ్ళిపోయేవాడు. అతడు మత్స్యేంద్రుడనే సిద్ధుని శిష్యుడు. గోరక్ చాలా దుర్మార్గుడు. రాక్షసులకన్నా క్రూరుడు. అందువల్ల అతనికి "మునిరాక్షసుడు" అని పేరు వచ్చింది. ఎంతోమంది గొప్ప గొప్ప మునులను తన మాయచేత జయించి తనకు దాసులుగా చేసుకొన్నాడు. మునులూ, సిద్ధులూ కూడా అతని పేరు చెబితే గడగడలాడేవారు.

ఇలా ఉండగా ఒకనాడు పిడుగులాగ రామానందుని ఆశ్రమందగ్గర గోరక్ ప్రత్యక్షమయ్యాడు. అతణ్ణి చూడగానే రామానందుడు భయంతో వణకిపోయాడు.

"నీవు నాకు దాసుడవౌతావా? లేక నాతడాఖా రుచిచూస్తావా?" అని గోరక్ రామానందుని అడిగేడు.

"దాసుణ్ణే" అని అనబోయేలోగా కబీరు ఎక్కడినుంచో పరుగుపరుగున వచ్చి అడ్డుపడి, గురువుగారితో "మీరు చూస్తూవుండండి. వీడిపని నేను పడతాను" అన్నాడు.

ఈ మాటలు వినగానే గోరక్ మండిపడ్డాడు. పది సంవత్సరాల పిల్లవాడు తన్నెదిరించడమా? కబీరు సాహసం చూచి రామానందుడు కూడా తన ప్రాణాలమీదికి వస్తుందేమోనని భయపడ్డాడు. కబీరును మందలించాడు.





కబీరు ఒప్పుకో లేదు. "గోరక్ చేత మీకు ఈవేళ నమస్కారం చేయిస్తాను" అన్నాడు. గోరక్ కోపంతో "జై మత్స్యేంద్ర నాథ్" అని అరచి, తలలోని జడను ఒకటి పీకి నేలకేసి కొట్టేడు. వెంటనే అది ఒక మహా రాక్షసిగా మారి, నోరు తెరచుకొని, కబీరు పైకి వెళ్లింది. కబీరు జంకులేకుండా ఒక గడ్డిపోచను తీసి రామమంత్రము స్మరించి "జై రామానంద్" అని ఆ రాక్షసి పై వేశాడు. వెంటనే ఆ గడ్డిపరక ఒక బాణం క్రింద మారి, నిప్పులు కక్కుతో పోయి ఆ రాక్షసిని భస్మం చేసింది. తను పంపిన 'శక్తి' ఆ విధంగా భస్మమై పోయినందుకు గోరక్ తెల్లమొగం వేశాడు. కబీరు సామాన్యుడు కాడని తెలుసుకొన్నాడు.

తర్వాత, గోరక్ తన మాయాబలంతో ఆ వూళ్లో ఎక్కడెక్కడ వున్న నీరంతా త్రాగివేశాడు.

చూస్తూ చూస్తూ ఉండగానే నూతులు, చెరువులు, పూర్తిగా యెండిపోయాయి. ఎవరింట్లోనూ నీరు ఒక చుక్క కూడా లేదు! వెంటనే గ్రామంలో వున్న జనమంతా గొల్లుమని అక్కడకు వచ్చేరు. త్రాగేందుకు నీళ్లు లేవని, రక్షించమని, గోలపెట్టారు. కబీరును ఇకనైనా లొంగి పొమ్మని రామానందుడు సలహా ఇచ్చేడు. కబీరు ఒప్పుకోలేదు. "జై రామానంద్" అని కాలి బొటనవ్రేలితో నేలను గట్టిగా అదిమేడు. అదిమిన చోటినుండి నీరు గొట్టంలోనుండి వచ్చినట్లు పైకి రావడం మొదలుపెట్టింది. నీరు కావలసినవారంతా కాలిబొటనవ్రేలితో 'జై రామానంద్'



అంటూ నేలను అదిమితే నీరు వస్తుందని చేప్పేడు. జనమంతా అలాచేశారు. ఎక్కడ అదిమితే అక్కడ నీరు పైకి వస్తోంది.

ఇది చూసేసరికి గోరక్‌కు గుండె దడ పట్టుకుంది. ఇంకో మాయ ప్రయోగిద్దామని గోరక్ చేయి యెత్తేడు. వెంటనే కబీరు మనసులో శ్రీరామచంద్రుని ధ్యానించి, "గోరక్! నువు కదలకు." అని అజ్ఞాపించాడు. కబీరు ఆ మాటఅనీ అనడంతోనే, గోరక్ చెయ్యి, ఎత్తినది ఎత్తినట్లే ఉండిపోయింది. గోరక్ కాళ్ళూ చేతులూ కదలకుండా ఆగిపోయాయి. అతడు రాతిబొమ్మలా నిలబడిపోయేడు. ఇక లాభములేదని, గోరక్ కబీరుతో యిలా అన్నాడు: "కబీరూ, ఈ రోజునుండీ నేను, నీకూ, నీగురువుకూ దాసుణ్ణి. నన్ను క్షమించి, నీ శిష్యుణ్ణి చేసుకో. నీకు నమస్కారం చేద్దామన్నా నా చేతులు కదలటంలేదు."

ఇలా అతడు అనీ అనడంతోనే గోరక్ చేతులూ,కాళ్లూ అతని స్వాధీనమయ్యాయి. వెంటనే అతడు కబీరుకు, గురువు రామానందునకు నమస్కారం చేశాడు. ఆ రోజు



నుంచి అతడు ఎవరినీ బాధపెట్ట లేదు. అది కబీరు అజ్ఞ.

ఆ విధంగా కబీరు చాలా చిన్న వయస్సులో గొప్ప గొప్ప మునులు గెలువలేని గోరక్‌ను, భగవంతునిపై భక్తివల్ల జయించేడు.

పిల్లలారా! మీరు కూడా కబీరువలే భగవంతునియందు భక్తి, మీ తోడివారిపై దయ, తలచిన పనులలో పట్టుదల కలిగి కబీరువలె గొప్పవారయేందుకు ప్రయత్నించండి.



చామర్తి వీరేశ్వరి, తెనాలి



విద్యుల్లత నెల్లూరు



సావిత్రి, మద్రాసు



# శివరామబ్రహ్మాం

అనగా అనగా ఒక ఊరులో ఒక వైష్ణవుడుండేవాడు. అతనికి శైవులంటే గిట్టదు. ఎందుచేతంటే శైవులు శివుణ్ని పూజిస్తారు. వైష్ణవులు విష్ణువుని పూజిస్తారు.

ఒకరోజున ఒక శైవ బాటసారి దోవను పోతూ ఈ వైష్ణవుని ఇంటికి వచ్చాడు. వైష్ణవుని భార్య చాలా మంచిది. అతన్ని ఉండమన్నది. వైష్ణవుడు శైవుణ్ని తన ఇంట్లోకి రావద్దాన్నాడు. కాని భార్య బ్రతిమిలాడ్డము వలన ఎలాగో ఓలాగ ఒప్పుకున్నాడు. వైష్ణవుని భార్య శైవునికి భోజనము పెట్టబోతే వైష్ణవుడు తన భార్యను తన్నబోయాడు. శైవుడు " రామ, రామ " అనుటకు బదులుగా "శివ, శివ" అని అన్నాడు. వైష్ణవుడు ఉగ్రుడై శివస్మరణ తన ఇంటిలో పనికిరాదని బాటసారిని వెళ్లి పొమ్మన్నాడు.



తన తప్పు క్షమించి తనకు ఆ రాత్రికి అక్కడ పరుండుటకు స్థళమిమ్మని శైవుడు, వైష్ణవుని బ్రతిమాలాడు. ఎలాగైతే నేం వైష్ణవుడు శాంతుడై సరేనని అన్నాడు.

తెల్లవారు ఝామున నాలుగు గంటలకు శైవుడు నిద్రలేచి మామూలు ప్రకారము " శి వ రా మ బ్ర హ్మం " " శివరామ బ్రహ్మం " అని ఆవలిస్తూ కూర్చున్నాడు. అది విన్న వైష్ణవుడు కొంప మునుచుకొని పోతున్నట్లుగా "ఒసే,పాపిష్టిదానా! నే చెప్పిన మాట విన్నావుటే ? ఇంకేముండే, మన స్వామివారు నలిగిపోతూ వున్నారు. ఇద్దరి మధ్యపడి నలిగిపోతూవున్నారు. రా! రా!" అంటూ గాబరాగా భార్య దగ్గరకు పరిగెత్తేడు.

అది వినిభార్య "ఏమిటండీ ఏమయింది? ఎవరు? ఎవర్ని నలపడం?" అంటూ నిదర మంచము మీదనుంచి లేచి వచ్చింది. అప్పుడు వైష్ణవుడు "ఒసి దేభ్యం వినవే! శివుడు, బ్రహ్మం మన స్వామి వారైన రాములవారిని మధ్యపెట్టి నలిపివేస్తూ వున్నారు చూడు" అంటూ శైవుని వంక చూపెట్టాడు.

శైవుడు గుడ్లు మిటకరించుకుంటూ " శివరామబ్రహ్మం " అంటూ వున్నాడు. వైష్ణవుడు వుండబట్టలేక ఒక బడిత పట్టుకుని శైవునివెంట బడ్డాడు. శైవుడది చూచి ఒకటే పరుగు.

---

వేమూరి కమల, బెజవాడ

---



# పిల్లి శకునము

అనగా అనగా ఒక ఊళ్లో దాసప్ప అనే అతను వుండేవాడు. అతను ప్రతిదినము భిక్షమెత్తుకొని వస్తే అతనూ అతని పెళ్లాం జీవిస్తూండేవారు.

ఒకనాడు దాసప్ప తెల్లవారుఝామున నే లేచి స్నానంచేసి జోలె తగిలించుకుని భిక్షాటనకి సిద్ధమయ్యాడు. బయలుదేర బోతూండగా అతనికి వాకిట్లోనే పిల్లి అడ్డం వచ్చింది. "పిల్లి అడ్డమొస్తే అశుభము. ఇవ్వాళ భిక్షానికి పోవద్దు" అని అతనిని పెళ్లాం చాల బ్రతిమాలింది. అయితే మన దాసప్ప వింటేగా! అతనికి యిలాంటి పిచ్చి నమ్మకా లేవీ రుచించవు. అందుచేత భార్య మాటలు పెడచెవినిబెట్టి భిక్షాటనకు బయలుదేరాడు.

మొదట అతడు ఒక ఇంటివద్ద నిలిచి ఏ దేవుని ప్రార్థిస్తే ఫలముంటుందా అని ఆలోచనలోపడ్డాడు. అప్పుడు మన దాసప్పకు ఆదిశేషుడు జ్ఞప్తికొచ్చాడు. "ఆదిశేషుడు యీ సమస్త భూమండలమును తన ఫణములపై మోస్తూ ఎంతో ఓర్పుగల్గి వున్నాడుకదా! అతనిని వేడుకొంటే ఏమైన ఫలముండునేమో" నని ఆదిశేషుని పేరిట, "పవ్వాళించితివా ఓ శేషయ్యా, పవ్వాళించితివా!" అనే పాటను గట్టిగాను, మృదుమధురంగాను పాడేడు.

ఆ యింటాయన పేరు వేంకటశేషయ్య. ఇరుగు పొరుగువారు అతనిని 'శేషయ్య' అనే పిలిచేవారు. ఆరోజు శివరాత్రి అవటంచేత అతడు రాత్రంతా జాగారంచేసి సినిమాకు మూడవ ఆటకుకూడ వెళ్లివచ్చి, పాదరక్షలైనా విప్పకుండా పడుకొని సుఖ నిద్రలో నున్నాడు. మన దాసప్ప పాట వినేసరికి శేషయ్యకు మహా కోపమొచ్చింది. నిద్రాభంగము చేసినది ఒక కారణం, తనని పేరుతో పిల్చి లేపడం మరొక కారణంగా తీసికొని, కోపంతో బయటికి వచ్చి మన దాసప్పకు అర్ధచంద్ర ప్రయోగము, పాదరక్ష పూజా రెండూ గావించాడు.

అక్కడనుండి బయల్దేరి మన దాసప్ప మరొక యింటిపంచ చేరుకున్నాడు. అప్పుడు మన దాసప్ప యిలా అనుకున్నాడు. "ఆదిశేషుడు నాపై దయజూప

వై. డేవిడ్ నెల్సన్, ధర్మవరం.



లేదు. శ్రీరామచంద్రుడు దయాస్వరూపి కదా! అతనిని స్మరించినచో కృపగల్గు నేమో!" అనుకొని, పూర్వము శ్రీరాముడు సీతతోగూడి అరణ్యములకు పోవునపుడు దశరథుడు పుత్రశోకంచే పాడిన, "పోవు చున్నావా, ఓరామయ్యా,పోవుచున్నావా!" అనే పాటను దుఃఖరసంతో, గానంచేశాడు.

ఆ యింటాయన పేరు రామయ్య. అతని కేదో గొప్ప జబ్బు వచ్చి, అటో యిటో అనే స్థితిలోనుండగా, బంధువులందరూ అతని చుట్టూ గుమికూడి అతనికోసం విలపిస్తూ వున్నారు. మన దాసప్ప పాట వినేసరికి వారి కెక్కడలేని కోపమొచ్చింది."చనిపోక ముందే వీడు శకునపక్షిలాగ యిలా పాడు తున్నాడు," అని వారు బయటికి వచ్చి మన దాసప్పకు బాగా మంగళహారతి గావించారు.

తన దురదృష్టమును తానే నిందించు కొంటూ మన దాసప్ప మరోయింటికి దారి తీసేడు. అప్పుడు మన దాసప్ప యిలా అనుకున్నాడు. "ఆదిశేషునకు నాపై దయ లేకపోయింది.శ్రీరాముడు దయామయుడని అతనిని వేడినా అతడుగూడ కటాక్షింప లేదు. మగవారి హృదయము కఠిన శిల వంటిది. స్త్రీ హృదయము వెన్నవలె చాలా మెత్తనిదని పెద్దలు చెప్పుదురే! ఆ సీతమ్మవారిని స్తోత్రించినచో, ఆమెకైనా




నాపై దయకల్గక పోవునా?" ఈ విధంగా అనుకుంటూ మన దాసప్ప మరో గుమ్మం ముందు ఆగేడు. అప్పుడు మన దాసప్పకు సీతాదేవి లంకలో చెఱబెట్టబడినపుడు, ఆంజనేయుడు ఆమెను అశోకవనము నందు కనుగొన్న సందర్భం జ్ఞాపక మొచ్చింది. ఆ సమయంలో ఆంజనేయుడు పాడిన "కనుగొంటి నమ్మా, సీతమ్మా, నిన్ కనుగొంటినమ్మా, సీతమ్మా!" అనే పాట తలపునకు వచ్చి, ఆ పాటను గంభీరంగాను, రాగయుక్తంగాను పాడ సాగాడు.

ఆ యింటావిడపేరు సీతమ్మ. ప్రొద్దున్నే ఆమె పెరటిలో స్నానంచేస్తూవుంది. ఆ పెరటిగోడ వానచేత అక్కడక్కడ కొద్ది





కొద్దిగా పడిపోయింది. కాని, యిక గత్యంతరంలేక ఆమె అక్కడనే యెట్లో దడబుడా స్నానంజేస్తోంది. మన దాసప్ప పాట వినేసరికి సీతమ్మ గుండెలు గుండెల్లో లేవు. నిజంగా తన్ను ఆ దాసప్ప చూసే ఆ పాట పాడుతున్నా డనుకుంది. స్నానం చేసి చప్పున చీరెకట్టుకుని ఒక మూల నుంచిన పాత చీపురుకట్ట తీసికెళ్లి, మన దాసప్పను ఛడామడా నాలుగేట్లు వీపుపై బాదింది. "కుయ్యో... మొర్రో..." అనుకుంటూ మన దాసప్ప యింటి మొగం పట్టేడు.

దాసప్ప పెళ్లాం, వీపుపైనుండే వాతలు చూచి సంగతేమిటని అడిగింది. దాసప్ప జరిగినదంతా పూసగ్రుచ్చినట్లు పెళ్లాంతో చెప్పుకున్నాడు.

"నేను మొదట్లోనే చెప్పలేదా? పిల్లి అడ్డమొచ్చింది, యీవేళ ఎక్కడికి వెళ్లొద్దని? నేను ఎంత బ్రతిమాలినా విన్నావా? తగిన శాస్తి జరిగింది. నీకు కావలసిందేలే." అని ఆమెగూడ బాగా చీవాట్లు పెట్టింది.

పాపం. ఇదంతా పిల్లి మహిమే ననుకుని ఇంకెప్పుడూ పిల్లి అడ్డమొస్తే ఎక్కడకూ వెళ్లనని మన దాసప్ప తీర్మానించుకున్నాడు.

చూశారా! ఇందులో పిల్లి తప్పుమాత్రం ఏముంది? అన్నీ అలా కలిసివచ్చాయిగాని.



# ముగ్గురు చిత్రకారులు

సంపాదన: శ్రీ రఘురామ్, బెజవాడ

ఒక ఊళ్లో ముగ్గురు చిత్రకారులు ఉండే వారు. ఆ వూరి కొక జడ్జివచ్చి ముగ్గురిలో ఎవరు మంచిబొమ్మ వేస్తే వారికొక బంగారు గొలుసు ఇస్తానన్నాడు. ముగ్గురూ మూడు బొమ్మలు వేశారు. పెద్దవాడు ఒక పూలగుత్తిని, రెండవవాడొక పండ్లబుట్టను, మూడవవాడు ఒక తెరను చిత్రించారు.

ఒక తేనెటీగవచ్చి పెద్దవాని బొమ్మను చూచి నిజముగా పూలే అనుకుని దాని లోని తేనె తాగుటకు వచ్చి మోసపోయింది.

ఒక చిలక రెండవవాని బొమ్మను చూచి నిజముగా పళ్లే ననుకుని పళ్లు తినటానికి వచ్చి మోసపోయింది.

తర్వాత జడ్జీ 'మూడవ బొమ్మ ఏదీ' అనుకొని తెరను చూచి, ఆ తెరవెనకాల బొమ్మ ఉన్నదేమోననుకుని తెర ఎత్త బోయాడు. కాని వెంటనే అది బొమ్మ అని తెలుసుకొని బహుమతిని మూడవ వాని కిచ్చాడు. మిగతవారు కారణ మడుగగా 'పూలగుత్తి, ఒక పురుగును మోసగించింది. పండ్లబుట్ట ఒక పక్షిని మోసపుచ్చింది. తెరబొమ్మ ఒక మనిషినే మోసపుచ్చింది, కనుక ఆ మూడవవానికే బహుమతి యిచ్చాను' అన్నాడు జడ్జి.

## కడుపునొప్పికి కంటివైద్యం

రచన : ఉప్పల రామమూర్తి, వెంకటగిరి

రోగి

అమ్మరో చచ్చితి అయ్యో దీనికిని
నిమ్మళించెడిమందు నియ్యరే మీరు
కడుపునొప్పివలన కడుబాధ కలిగె
విడుపుచూపుమ నిన్ను వేడుచున్నాడ.

వైద్యుడు

కడుపునొప్పేలర కలిగెను నీకు?
కుడుములు నింపితే కుండలోపలను
పల్లెటూరి పశువ బలముగా మెక్కి
యిల్లెగురంగను నేలకూసెదవు?

రోగి

పెసరట్లు తింటిని ప్రియముతో నేను
చక్కని పెసరట్లు చలువచేయునని
మాడిన పెసరట్లు మరిరెండు దినగ
పాడు కడుపునొప్పి పై నుండి దూరె.

వైద్యుడు

తిండిపోతువలెను దింటివే యట్లు
మొండివోలెను నొప్పి ముద్దు బెట్టెనుర
పూయు మీ కాటుక పూయు మీ వేళ
పూయుము కంటికి పూయు తిమ్మన్న.

రోగి

కంటికిమందేల కడుపునొప్పి యన
కంటికి మసకైన గనరాదె నాకు
మంచివైద్యం బయ్యో మాట బాగయ్యో
వంచన సేతురే వసుధను నన్ను.

వైద్యుడు

మాడినయట్లకు మంచిమందగుర
పాడు కడుపు నొప్పి పారిపోవునుర
మసక లేకుండిన మాడిన యట్టి
పెసరట్లు తిందువే బేల తిమ్మన్న.

## చందమామ పజిల్

(బాషాభివృద్ధికి)

### ఆధారములు

**అడ్డము :**

1. ఒక చిన్న కీటకము
3. ప్రారంభము
5. భయము
7. దీనితో వ్రాయుదుము
9. ఒక వాద్యము
11. వ్యవహారము
13. తియ్యని వస్తువు
15. సత్యవంతునిభార్య
16. రాత్రి
17. అసత్యము




**నిలువు :**

2. మూడడుగులు
3. నిలిపివేయుట
4. వచ్చుట
6. ఆశ్చర్యార్థకము
8. లవకుశులలో ఒకడు
10. వైశ్యుడు
11. నింద
12. దయలేనివాడు
13. దీనిని చదువుదుము
14. నేత్రము

# దొరగారి గుఱ్ఱం

ఆ ఊళ్ళో అయనను చూస్తే అందరికీ భయమే. ఎత్తుగా లావుగా ఉంటాడు; పెద్ద గిరజాలు, పెద్దపెద్ద మీసాలు, చేతులో ఎల్లప్పుడు ఒక పెద్ద కఱ్ఱ. ఆయన ఆ ఊరికి మొఖాసాదారు.

మొఖాసాదారుగారికి ఒక గుఱ్ఱము ఉండేది. ఆ గుఱ్ఱమంటే ఆయనకు ఎంతో ఆపేక్ష. అది చచ్చిపోయిందనే మాట ఎవడు నోట పలుకుతాడో వాణ్ణి ఊరి బయట చింతచెట్టు కొమ్మకు కట్టి ఉరి తీస్తానని ఆయన శపథము పట్టాడు.

కొంత కాలానికి గుఱ్ఱము చచ్చిపోయింది. ఆ వార్త మొఖాసాదారుగారితో ఎల్లాగు చెప్పడము? చెప్పకపోతే ఎందుకు చెప్పలేదని ప్రాణం తీస్తాడు. చెప్పినట్లయితే చింత చెట్టు కొమ్మకు కట్టి ఉరిపిస్తాడు.

పాలేళ్లు జీతగాళ్లు అంతా ఏమి చెయ్యటానికి తోచక ఆలోచనలోపడ్డారు.

వాళ్లలో సుబ్బడని పదిహేడేళ్ళ మాదిగ కుఱ్ఱవాడు ముందుకు వచ్చాడు. దొరగారికి వార్త చెప్పడానికై వాడు బయలుదేరుతుంటే "ఒరే, నిండు ప్రాణం ఎందుకు తీసుకుంటావు అగరా" అని ఒక ముసలమ్మ కేకవేసింది.

కాని వాడు వినిపించుకోలేదు.

సుబ్బడు తిన్నగా దొరగారి ఇంటికి వెళ్లాడు. "దొరగారూ, దండాలు" అని కేకవేస్తే, ఆయన మీసాలు దువ్వుకుంటూ ఇవతలికి వచ్చి, 'ఏరా సుబ్బా! ఇప్పుడొచ్చావు?" అన్నారు.

"ఏంలేదు దొరగారు."

"మనగుఱ్ఱం బాగా ఉందిరా?"

"సక్కగుంది దొరగారు. గుఱ్ఱానికేం దొరగారు. కాని, దొరగారూ, దానికి కళ్లుండయి, సూపులేదు. నాలుగు కాళ్లుండయి, అయ్యి కదలవు; లచ్చనంగా

కపిల వెంకట్రావు



పడుకోని ఉండది దొరగారు. మరి, ఎలపటి ప్రక్క బురదలో నానుతుండది. దాపటి ప్రక్క ఎండలో ఎండుతుండది, ఊపిరి పీలవడం కానరాదుగాని గుఱ్ఱానికేం దొరగారు," అన్నాడు సుబ్బడు.

"అయ్యో, మనగుఱ్ఱం చచ్చిపోయిందీ?" అన్నారు దొరగారు.

"సచ్చిందని నా నోటితో నేననలేదు దొరగారు. తమరే అన్నారు గనక, మరి సింత సెట్టుదగ్గిరికి ఎప్పుడు పోదాం దొరగారు" అని అడిగాడు సుబ్బడు.

దొరగారికి కంపమెత్తింది. "అరే పొరబాటున నోరు జారిందిరా, సుబ్బడూ! మరెక్కడా అనకు ఈ మాట" అని సుబ్బడిని బ్రతిమాలుకున్నారు.

"దానికి కట్టిన కళ్లెము, జీను, కొరడ సామాను, దాని చర్మం నాకిస్తే నేను మాటా పలుకు లేకుండ ఊరకుంటాను. లేకపోతే..." అన్నాడు సుబ్బడు.

వాడు కోరినవన్నీ వాడికిచ్చి దొరగారు బయటపడ్డారు. ముసలమ్మ ఆశ్చర్యపోయింది. ఊరంతా సంతోషించారు. సుబ్బడికిమాత్రము అందరికంటె ఎక్కువ సంతోషము కలిగింది.



## రోకంటి పాటలు

సంపాదన: ఈదర బసవపూర్ణమ్మ

విచిత్రం పుట్టింది యీ కొనలోన
యిపుడు పుట్టిన బాల మాటలాడింది
రాత్రి పుట్టిన బాల రాట్నం వడికింది.
కోయిలా కూయంగ కొండలదిరేను
కోయిలా నీవేల కూయకున్నావు?
గోత్రాల తమ్ముళ్లు దున్నకున్నారు.
దున్నంగ మా ఎడ్లు, గుండలదిరేను.
తూరుపు యిల్లు వంక దూలాలు వంక
దున్నివచ్చే మాయెడ్ల కొమ్ముల్లు వంక.
కొండ రాళ్ళలోన కొఱ్ఱ పండింది
కోసెవారూ లేక పూచ తేలింది.
కోసుకో అన్నయ్యా వేసుకో కుప్ప
నూర్చుకో అన్నయ్యా నూరెడ్లబెట్టి
తోలుకో తమ్ముడా జోడెడ్లబెట్టి
పంచుకో రన్నయ్యా పదిమంది నెట్టి.

### పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 1 ఈ | 2 గ | | 3 ఆ | ది | |
| 4 రా | | 5 జ | డు | పు | | 6 బొ |
| 7 క | 8 ల | ము | | 9 ట | 10 కో | రా |
| | వు | | | | మ | |
| 11 వా | డు | 12 క | | 13 హ | టి | 14 క |
| దు | | 15 పా | వి | త్రి | | న్న |
| | 16 రే | యి | | 17 క | ళ్ల | |



## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పై చిక్కు చదరం మధ్యని ఒక కోటవుంది చూశారా. చదరం నాలుగు మూలలా నలుగురు సైనికులు గుఱ్ఱాలమీద వచ్చివున్నారు. ఆ నలుగుర్లో ఎవరో ఒకరు మాత్రమే ఆ కోట చేరుకోగలరు. ఆ అదృష్టవంతుడెవరో కనుక్కొండి చూద్దాం.

---

12 పేజీలోని చిక్కుబొమ్మలకి జవాబు:
1, 6 నెంబర్ల జతలు రెండూ ఒకే మోస్తరువి.


YUVA PUBLICATIONS
MADRAS & BEZWADA



నాజూకుకు..
సౌఖ్యానికి..
మన్నికకు..

ప్రసిద్ధిగాంచిన పింగాణీ వస్తువులు,

## ఇండియా సిరామిక్స్ లిమిటెడ్

నెల్లూరు :: కాళహస్తి :: మద్రాసు

## ఈస్ట్ & వెస్ట్ ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్, బొంబాయి

[1913లో స్థాపితము]

ప్రధానకార్యాలయం: 'ఈస్ట్ అండ్ వెస్ట్ బిల్డింగ్', ఫోర్టు, బొంబాయి.

34 సంవత్సరాలుగా దేశసేవచేస్తూ జాతీయోన్నతి
పెంపొందిస్తూ ఉన్న ప్రముఖ భారతీయ భీమా సంస్థ.
ఆర్థికంగా సుస్థిరమై, పాలసీదార్లతోనూ, ఏజంట్లతోనూ
వ్యవహరించుటలో పంస్కారానికి పేరెన్నికగన్న సంస్థ.
1944లో జరిపిన అదనపు వ్యాపారం కోటి రూపాయలు మించింది.

చురుకైనటువంటివీ, పలుకుబడి కలిగినటువంటివీ వ్యక్తులు
ఏజన్సీలకొఱకు దరఖాస్తులు పెట్టుకోవచ్చును.

<u>వివరాలకు:</u>

శ్రీ జె. యస్. రెడ్డి,
బ్రాంచి సెక్రటరీ,
377, ఎస్ప్లనేడ్, మద్రాసు.

శ్రీ వి. ఎ. నాగరెడ్డి,
ఛీఫ్ ఏజంటు,
రాయలసీమ ఏరియా, విక్టోరియాపేట, ఆదోని.

శ్రీ యస్. మల్లికార్జునరావు, ఆర్గనైజింగ్ సెక్రటరీ, బెజవాడ.

## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

మీరు కథలుగాని, పాటలుగాని యింకా ఏవైనా రచనలుగాని మాకు పంపేటప్పుడు మూడు కానుల పోస్టుబిళ్ళకూడా పంపాలి. మీరు పంపినవి వేసుకుంటున్నామో లేదో మీరు తెలుసుకోవాలన్నా, వేసుకోకపోతే వాటిని మీకు త్రిప్పి పంపాలన్నా ఈ మూడు కానబిళ్ళ పంపటం అవసరం. మీ రచనగురించి ఏమైనా తెలుసుకోవాలంటే రచనతోపాటె మూడుకాన్ల బిళ్ళకూడా పంపాలి. రచన పంపినతర్వాత వ్రాసిన ఉత్తరాలకి జవాబు యివ్వటానికి వీలుండదు.

చందాదారులు, మాకు వుత్తరాలు వ్రాసేటప్పుడు తమ చందా నెంబరుకూడా వ్రాయటం ఎంతో అవసరం. అలా చందా నెంబరు తెలియజేయకుండా వ్రాసిన ఉత్తరాలకి జవాబు వ్రాయటంలో చాల ఆలస్యం జరగవచ్చు.

రచనలు పంపే అడ్రసు ఇది:

సంచాలకుడు: **చందమామ**

పోస్టుబాక్సు నెంబరు: **1686**, మద్రాసు

Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors: CHAKRAPANI and K. RAJA RAO.



Chandamama July '48

Photo by R. Krishnan

మేమందరమూ ఒకటి!



చందమామ సామెతలు – ౧

**బాల పాపలు ఇంటికి వెలుగు**

**చందమామ దేశానికి వెలుగు!**

చందమామ కన్నడంలోనూ

అరవంలోనూకూడా వస్తున్నది

PRINTED AT THE B. N. K. PRESS, 37, ACHARAPPAN ST. MADRAS - 1